# పండితాభిప్రాయములు.

సాహిత్యరత్న విశారదాంకితులు శ్రీయుతులు దివ్వాల పిచ్చయ్య గుప్తగారు రచించిన "వాసవీకన్యక" అను నాటకమును చదివి ప్రశంసించితిని.

సినిమా పరిశ్రమ పోటీవలన నామరూపములు లేక నశించుచున్న నాటకరంగమునకే నాటికి ఉత్తమ చారిత్ర్యాంశయుక్తములు, ఉదాత్త పాత్రోపేతములు, ప్రేక్షక సానుభూతి పాత్రములునగు నాటకము లెంతేని యవసరము.

ప్రస్తుత నాటకము ఈనాటి స్టేజీల కెంతేనియు దగియున్నది. కరుణరస ప్రధానముగ నున్నను దీనియందన్ని రసములు నాయా యెడల స్థానమునంది ప్రేక్షకుల చిత్తముల నాకట్టగల్గుచున్నవి.

కన్యకా పురాణములోని కథననుసరించి ఆధునిక సంస్కార భావ సమ్మేళనముతో నిర్మింపబడిన యీ నాటకమందొనరింపబడిన మార్పులు సమ్యానయ హృదయంగమములై యున్నవి.

హరిజన దేవాలయ ప్రవేశము మొదలుకొని, రాజకీయ బాధితుల సమస్య వరకుగల ఆధునిక సమస్యలన్నియు ఈ నాటకమున స్థానము నార్జించుకొన్నవి. కాళిదాస రచనలమీది విమర్శ కమనీయముగా ఉన్నది. వేదాంత చర్చలతో, సున్నితమైన, హాస్య పూరితమైన ఎత్తిపొడుపులతో వివిధ మనస్తత్వాలకు చెందిన పాత్రలతో ఈ నాటకమొక విశిష్టతను సంపాదించుకొన్నది.

ఇట్టి విశేష విషయములతో నాటకమును రచించిన కవిగారు ఇక ముందుముందు రచనలలో లోకాతిశయమైన ప్రతిభా విశేషమును ప్రకటింతురుగాక యని యాశించుచున్నాను.

— విద్వాన్ వనమా వేంకటరమణగుప్త,
సత్తెనపల్లి.

# వాసవీ కన్యక

( నాటకము )



రచయిత :

దివ్వెల పిచ్చయ్యగుప్త

"సాహిత్య రత్న"

1952



 వెల : 1—0—0

గుడివాడ :: కృష్ణాజిల్లా.



రచయిత

దివ్వెల పిచ్చయ్య గుప్త.

"సాహిత్యరత్న".

# పీఠిక

"కావ్యేషు నాటకం రమ్యం" అన్న ఆర్యోక్తి నాటక తత్త్వాన్ని వ్యక్తం చేస్తుంది. కేవలం కావ్యాత్మకంగా నాటకరచన పండిత పామర జనానుకూలముగానుండునట్లు కవి ప్రతిపాదిత విషయం రూపొందటం జరుగుతుంది. ఇతివృత్తానికి సంబంధించిన నాయికనైన వనిత అనే కుల తత్త్వభావనతోగాక అనేక శతాబ్దములుగా నాటుకుపడియున్న అపూర్వ ఆంధ్రనారీ మహత్తర త్యాగశక్తిని అంకితభావసహాయులముందు రూపొందించటమే నా యాశయం. నాటక రచనలో కేవలచారిత్రక ఇతివృత్తమేగాక దానికితోడుగ కల్పిత పాత్రలుగూడ కొన్ని ప్రస్తుత సాంఘిక దురాచారాలు దృశ్యరూపంలో ప్రదర్శించే దృశ్యాలు రచింపబడినవి. నారయ్య, పర్వతశాస్త్రులు, సుశీలగుప్త, బ్రహ్మానందగుప్త మున్నగునవి. సర్వజనులకు అందుబాటులో నుండుటకు గ్రాంథిక భాషా వ్యాకరణ సిద్ధాంతాలకు స్వస్తిచెప్పి శుద్ధగ్రామ్య భాషలో నా రచన సాగించితిని ఇది నాసాహసమై నా గ్రంథరచనలోగల నా మహదాశయం నెరవేరగలదనే సంతృప్తి నాకు లేకపోలేదు. విష్ణువర్ధన, వాసవి పాత్రలద్వారా భౌతిక ఆధ్యాత్మిక శక్తిద్వయానికి జరిగే నిరంతర సంఘర్షస్థితిని ప్రదర్శిస్తూ నాటకాన్ని విషాదాంతంగా మార్చి ఆదర్శవాదానికి స్వస్తిచెప్పి కేవల యథార్థవాద ప్రతిపాదనచేసి స్వాభావికతకు భంగంరాని విధంగా రచించితిని. పద్యాలు వ్యావహారిక శైలిలోగాక గ్రాంథిక విధానంలోనే నడిపాను. దీనికి ఒక కారణం పద్యములల్లుటలో నా శక్తిపరిమితమవటం. రెండు గ్రాంథిక భాషాభిమానం. సామాన్య చదువరులుకూడ గ్రంథస్థ విషయం మననం చేసికొనగలగటం వ్యావహారిక భాషా ప్రయోగాశయమని మనవి.

నేను భాషావిదుణ్ణికాను. నాలో అనుభవజ్ఞత మృగ్యం, కేవలం నేను మననంచేసుకుని నమ్మిన సిద్ధాంతాలు జగద్వ్యాప్తి కావ

అని తోయంగాని లేదన్యం కాదు. గనుక రసజ్ఞులైన పండితులు, అనుభవజ్ఞులైన కవులు ఈ గ్రంథస్థమైన దోషాలను హంసక్షీరన్యాయంగా గ్రహించి దోషాలను దయతో తెలిపిన పునర్ముద్రణలో సవరించుకొందునని మనవి.

అయిదు సంవత్సరములుగా తమ నిరంతర శ్రద్ధతో హిందీ, సంస్కృత తెలుగు భాషలు నాకు చక్కగా బోధించి, అవ్యాజకరుణతో ఆధ్యాత్మిక తత్త్వ బోధచేత నన్ను సంపూర్ణునిగా జేసిన ఉత్తమ గురువులు శ్రీ రాళ్ళబండి దుర్గానాగేశ్వరరావు గారిని సాహిత్యవిశారద్ (తెలుగు పండిట్, మునిసిపల్ బోయస్ మిడిల్ స్కూలు, గుడివాడ) మరువజాలను. వారికి నా హృదయపూర్వక వందన సహస్రాలర్పిస్తున్నాను. ఈ గ్రంథ రచనలో నాకు బహువిధాల తోడుపడి వాసవీ కన్యక ఇతివృత్తానికి సంబంధించిన సంస్కృతాంధ్రభాషలలోని కథల పుస్తకాలు నాటకాలు నాకు చేకూర్చిపెట్టి అఖండ సహకారంచేసి ఉచిత సలహాలిచ్చి నా పరిశ్రమకు చేయూతనిచ్చిన బ్రహ్మశ్రీ విద్వాన్ రాళ్ళబండి సుబ్బయ్యగారికి (తెలుగు పండితులు, మునిసిపల్ హైస్కూలు. గుడివాడ) నా హృదయపూర్వక అభివందనాలర్పించుచున్నాను. శ్రమయనుకొనక ఓరిమితో నా గ్రంథసమగ్రపఠనంచేసి తమ అమూల్యాభిప్రాయముల నందజేసిన పండితులకు సంఘసేవకులకు నా హృదయపూర్వక ధన్యవాదాలు. శక్త్యానుసారం ధనసహాయం చేసిన వైశ్య సోదరులందరలకు నా హృదయపూర్వక ధన్యవాదాలు. ముందుగా ప్రతిఫలం గ్రహింపకయే ఉదార హృదయులై గ్రంథ ముద్రణ అచిరకాలంలో చేసి నాకందజేసిన శ్రీ శరత్ ప్రెస్, గుడివాడవారికి నా హృదయపూర్వక ధన్యవాదాలర్పిస్తున్నాను.

దివ్వెల పిచ్చయ్యగుప్త,
రచయిత

# పురుష పాత్రలు

కుసుమ గుప్త - విష్ణువర్ధన మహారాజుయొక్క సామంతరాజు.
(వాసవీ కన్యకకు తండ్రి)

విష్ణువర్ధనుడు - రాజమహేంద్ర పురపాలకుడు.

భాస్కరాచార్యుడు - కుసుమగుప్తుకు పురోహితుడు.

నారయ్యశెట్టి - ఒక సామంతరాజు.

మహేశగుప్త - గుడి ధర్మకర్త

పర్వతం శాస్త్రిలు - మహేశగుప్తుని పురోహితుడు.

విరూపాక్షుడు - కుసుమగుప్తుని కుమారుడు.

విజయుడు
పుండరీకాక్షుడు } బాల వగరులు.

బ్రహ్మానందగుప్త - ఒక దరిద్ర వైశ్య గృహస్థు.

# స్త్రీ పాత్రలు

వాసవి - కుసుమగుప్తుని కూతురు.

శీలవతి - బ్రహ్మానందగుప్తుని కూతురు.

(మాంత్రికుడు, విదూషకుడు, రాజ భటులు, రోగులు, గ్రామస్థులు మొదలగువారు.)



# వాసవీ కన్యక



## ఒకటవ రంగము.

—o—

(స్థానం: కుసుమశ్రేష్ఠి గృహము)

(కుసుమశ్రేష్ఠి, భాస్కరాచార్యులు, ఆసీనులైయుందురు)

కుసు :– ఆచార్యా! వాసవి బాగా చదువుకుంటూందా?

భాస్క :– చదువుకోవడమేమిటి? ఎదురు చదువు నేర్పుతోంది ప్రభూ.

కుసు :– అంటే మీ యభిప్రాయం...సరిగా చదవటం లేదనా?

భాస్క :– ప్రభూ! నా ఉద్దేశం...వాసవికి.. సరిగా నేర్పవలసిందం టూ లేదేమో అని.

కుసు :– అంటే?

భాస్క :– సర్వజ్ఞురాలని భావం.

కుసు :– అలా అంటే?

భాస్క :– ఎలాగో ఇక్కడికే పిలువండి. నేనుంటే సిగ్గుపడుతుంది. పోయివస్తా. (పోతాడు)

కుసు :– అమ్మా, వాసవీ, వాసవీ.

వాసవి :– నాన్నా! ఇదేవచ్చా(ప్రవేశించి) నాన్నా ఎందుకు పిలిచారు?

కుసు :– నీవు పాఠాలు బాగా చదవవనీ, ఎంత చెప్పినా తెలిసికోవని గురువులు చెబుతారు. అది మంచిపనా. తల్లీ(తలనసవరించును)

వాసవి :– చదువులో ఉండే మర్మం తెలిసింతర్వాత చదువెందుకు నాన్నా! దక్షిణ పవనాలు సాగమారితే విసనకర్రలెందుకండి?

కుసు :- అదేమిటి అలా అంటావు. నేర్చుకోవలసిందెంతో ఉంటే అన్నీ నేర్చేసుకున్నానంటావు? ఇదేమి వింత ప్రసంగమమ్మా! సంగీతోపాధ్యాయులు, సంస్కృతోపాధ్యాయులు, ఆంధ్రోపాధ్యాయులు, అంతా ఒకమేళంకదా!! ఎవరు చెబుతోంది, ఎవరు చెప్తుతోంది అని. నీకేమిటి లోపం? రాజ్యాధికారం, సిరిసంపదలు, అష్టైశ్వర్యాలు కలిగిన పితృగృహం ఈ ఈడులో ఎన్ని విద్యలు నేర్వవచ్చు? నిజంగా సంస్కృత భాషలో ఎందరు మహాకవులున్నారు.! ఊఁ ఎంత రమ్యమైన సాహిత్యం. కాళిదాసువంటి మహాకవి ప్రపంచంలో మరే భాషలోనైనా తగులుతాడా? మనసుకైనా ఒక్కనాడైనా ఒక్కశ్లోకం శ్రావ్యంగా పాడి వినిపించవుగదా!

వాసవి:- కాళిదాసు రచనలు నేనన్నో చదివాను నాన్నా! అతని శాకుంతల, మేఘసందేశం, రఘువంశం, ఇంకా ఎన్నో గురువుగారింతో శ్రద్ధగా చదివించారు. కాని అవన్నీ నేర్పిందేమిటి? నిత్యమానవజీవితంలో ఉపయోగపడేది ఏదైనా ఉందా? అతడొక రసిక మహాకవి అంటే నేను ఒప్పుకుంటాను. అతని శృంగార రసం ఒకప్పుడు హద్దులుమీరి అశ్లీలంగా పరిణమిస్తూ ఉంటుంది. చూడండి నాన్నగారూ! కుమార సంభవంలో "యత్రాంశుకాక్షేప విలజ్జితానాం............ఛీ ఛీ పాడు భావాలు. ఓమహాకవి ఎలా వ్రాస్తున్నాడో,

శ్లో॥ క్షుద్రాస్సంతి సహస్రశః స్వభరణ వ్యాపారపూర్ణో
దరాః। స్వార్థోయస్యపరార్థఏవసపుమానేకస్సతా
మగ్రణీః। దుష్పూరోదరపూరణాయ పిబతిస్రోతః పతిం
వాడబః। జీమూతస్తుని దాఘసంభృత జగత్సంతాప
విచ్ఛిత్తయే॥

కుసు :- దీనిభావం?

వాస ;- ఈ ప్రపంచంలో ఉదారపోషణపరాయణశ్రేష్ఠులు ఎందరో ఉన్నారు. కాని పరశ్రేయోభిలాషులై, ఆ సౌఖ్యమే స్వసౌఖ్యంగా భావించే పురుషులే పురుషులు. సముద్రములో బడబాగ్ని లేదూ? నదులకు సంబంధించిన జలసంపద సంతటిని పొట్ట పెట్టుకుంటుంది. మేఘునకు, బడబాగ్నికి ఎంతభేదముంది అవస్థలో ఉభయులూ ఒకే సముద్రజలాన్ని పానంచేసినా అవస్థలో భేదముండకదూ! ఒకడు మాయదారి పొట్టకోసం ప్రాకృతిక సంపదనంతటినీ గుత్తకొంటూ, పరాపకారార్థం ప్రాణాలు వదలుతాడు రెండోవాడు పరోపకారార్థం పవిత్ర వ్యాపహరణంచేసి పరశ్రేయస్సుకోసమే ప్రాణాలు బలిపెట్టుతాడు. "పరాపకారార్థమిదంశరీరం" అని "పరోపకారార్థమిదంశరీరం" అని ఉభయ సిద్ధాంతాలూ రాద్ధాంతాలు చేసికుంటూ ఉంటే ఆ తీవ్రసంఘర్ష భావస్థితిలోనుంచి పుట్టుకు వచ్చే ప్రాణులంతా చెరిఒక పక్షానికీ చేరిపోతూఉంటారు. ఇట్టి సంఘర్షస్థితికే "ప్రపంచం" అని పెద్దలు నామకరణం చేశారు. ఈ ప్రపంచ నాటకాన్ని అనుభవజ్ఞులైన పండితులు తిలకిస్తూ, వివిధ దృశ్యాలకి చింతిస్తూ, సంతసిస్తూ, బ్రహ్మానందం అవగతం చేసికుంటారు. మర్మం తెలిసిన మహానుభావులు దానిచే ప్రభావితులుగాక మోక్ష సామ్రాజ్యాధికారం పొందుతూ ఉంటారు. ఇట్టి ఉజ్వల భావతరంగాలు మీరు తెలిపే రశికాగ్రేసర చక్రవర్తియైన కాళిదాస మహాకవినుండి సాధింపబడలేదు నాన్నగారూ! భర్తృహరి; శుక, శౌనకాది మహామునులు తీవ్రతర పరిశోధనలుచేసి తేల్చిన నిర్ణయమిది. నిజానికి మానవ జీవితాన్ని బాగుపరచేదే కవిత్వమంటాను.

కుసు ;- అయితే నీకోసం ప్రపంచమంతా రశికత్వాన్ని మాని అసభ్యతాదేవిని ఆరాధించాలన్నమాట. సరే దీనికేమిగాని సంగీత శాస్త్రమైనా బాగా చదువుతున్నావా?

వాసవి;- భాగవత గ్రంథంలాగా పరమపవిత్రంభరత శాస్త్రం. అది నా యభీష్ట విషయంకూడాను. దాన్నికూడా చక్కగా అభ్య సిస్తున్నాను.

కుసు ;- అలా అయితేచెప్పు! సంగీతమెన్ని విధాలు ?

వాసవి;- అది రెండువిధాలు, భరతం, హనుమంతం.

కుసు ;- అంటే

వాసవి;- అంటే భరతముని; సంగీతానికి "లయ ప్రాధాన్యం స్థిరీకరించాడు."హనుమంతుడు" "భావ"ప్రాధాన్యాన్ని ఒప్పుకున్నాడు, సంగీతం భావయుక్తంగా ఉంటే ఆనందం ఇస్తుందని హనుమంతుని మతమైతే "లయ" నుండే బ్రహ్మానందం ఉట్టిపడుతుందని భరతముని ఉద్దేశం.

కుసు ;- ఈరెంటిలో నీకేది ఇష్టమమ్మా ?

వాసవి;- భరతమే. భరతనాట్యం నేను బహు చక్కగా నేర్చాను.

కుసు ;- ఏదమ్మా చూస్తాను.

వాసవి;- (భరతనాట్యం చేస్తుంది)

కుసు ;- అమ్మా! నాకు నిజంగా బ్రహ్మానందం కలుగ చేశావమ్మా తల్లీ! లయబ్రహ్మను, భావవిష్ణుని. నటుమహేశుని ఏకంచేసి సంగీతం త్రిమూర్త్యాత్మకమనే నగ్నసత్యాన్ని ప్రత్యక్షంచేసిన నీ సామర్థ్యం నా గర్వానికి హేతువైనది. శభాస్‌వాసవీ! నేనూరకే అలా అన్నానుగాని విద్యాభ్యాసంలో నీ యభిరుచి ప్రశంసా పాత్రం కాదుతల్లీ! (దగ్గరకుతీసి తల దువ్వుతూ) నాకు పెద్దవయసు వచ్చింది. ఈడువచ్చిన పిల్లని ఇంకెంతకాలమిలా కన్యగా ఉంచటం ?

వాసవి;- నాన్నా! నా పెండ్లికి ఎందుకంత తొందర? తగినవరుడు లభించకపోతే వదిలెయ్యి నాన్నా! ఎవనికైనా ఇచ్చిన దగ్గిర

నుంచి అతిలోక మహాన్నస్థైతే నా కష్టాలు చూడలేకపోరు, మీ దుఃఖాన్ని చూడలేక నేను ఎందుకింత బాధానుభవం? పెండ్లి కానికన్యనెందుకు లేను? పోని లేకపోతే నేనే మొదటి దాన్ని అవుతాను. నిగులు వదిలెయ్యండి. నాన్నగారూ!

సు ;- నా కూతురుని అగ్నిపాలు చేయటానికైనా సమ్మతిస్తాను గాని కటినాత్ముని చేతుల్లోపెట్టి దాని జీవితాన్ని భ్రష్టం చేయటానికి సమ్మతించను.

వాసవి;- నేనూ అదేచెప్పుతా నాన్నా!

కుసు ;- (చిరునవ్వుతో) సిగ్గుపడకుండా చెప్పు. నీవు బాగా చదువుకున్నదానవి. సిగ్గెందుకు? ఎలాటి భర్తను నీవు కోరుకుంటావమ్మా!

వాసవి;- (లజ్జాభినయంతో) నాన్నగారు! మీరు కుమారసంభవం చదివే ఉంటారుగా!

కుసు ;- ఆ బహు చక్కని కావ్యం ఆ కావ్యంలో ముఖ్యంగా పంచమ సర్గలో అతని లేఖిని అమృతవర్షం కురిపించింది.

వాసవి;- దానిలో...... పార్వతి శివుని భర్తగావరించి పంచాగ్నుల మధ్యకూర్చుండి ఘోర తపస్సుచేసిన ఘట్టంకూడా ఉంది కాదూ?

కుసు ;- అవునవును. కుమారసంభవంలో పార్వతీసామర్థ్యం ఎంతో చక్కగా చిత్రించాడు కాళిదాసు.

వాసవి;- పంచమసర్గలో (జ్ఞాపకంజేసికుంటుంది) ఊఁ అదండి ...... పార్వతివద్దకు బ్రహ్మచారివస్తాడు అదే ప్రారంభ శ్లోకం ఆతని రాక సందర్భంలో ఊఁ

కుసు ;- ఆఁ జ్ఞప్తికి వచ్చిందిలే "అథాజినాషాఢధరః ప్రగల్భవాక్"

వాసవి;- ఆ, ఆ, అదే నాన్నగారు ఎంత శ్రావ్యమైన శ్లోకం అది. ఏది ఇంకోసారి చదవండి నాన్నగారు!

కుసు;- ([illegible])

శ్లో|| అథాజినాషాఢధరః ప్రగల్భవాక్ జ్వలన్నివ
బ్రహ్మమయేన తేజసా । వివేశ కశ్చిజ్జటిల
స్తపోవనం । శరీరబద్ధః ప్రథమాశ్రమో యథా ॥

వాసవి;- ఆహా నాన్నగారు! ఆ బ్రహ్మచారి ఎంత బాగున్నాడు! "శరీరబద్ధః ప్రథమాశ్రమో యథా" అజినాషాఢధరుడు, ప్రగల్భవాగ్వైభవంతో శోభిల్లువాడు. శుద్ధ పరబ్రహ్మతేజం ప్రజ్వరిల్లుచున్నట్లు ఉన్నవాడు బ్రహ్మచర్యాశ్రమం దేహం ధరించినట్లు ఒప్పుచున్న జటిలుడు, పార్వతిని సమీపించాడు,

కుసు;- అయితే నీ ధ్యేయం అట్టి బ్రహ్మచారిని నీవు ప్రేమిస్తా వన్నమాట, ఇదెక్కడైనా జరిగేపనేనా? వాసవీ! అట్టి బ్రహ్మచారులు పృథ్వీమీద ఉంటారా?

వాసవి;- ఉండకపోతే మీ వీలునుబట్టి చెయ్యండి.

(నారయ్యశెట్టి ప్రవేశం)

నారయ్య;- ఏమంటోంది భావగారు! అంతా క్షేమమేనా!

కుసుమ;- ఏమోయి! రా కూర్చో! అమ్మాయి మామయ్యకి నీళ్లు తీసుకురా!

వాసవి;- మామయ్య వంటినిండా నీళ్ళేగా, ఇంకా నీళ్లెందుకు? పాపం చూడు. నీళ్ల మత్తలాగా దేహం ఎలా తొణికిసలాడుతోందో అహహాహా. (నవ్వు)

నారయ్య;- (గుప్పిళ్లుబిగించి) ఆఁ బ్బలం, బ్బలం. మనమేనంతా దేహమేగా? అహాహాహాహా (నవ్వు)

వాసవి;- మామయ్యా! మహాబలిశాలి గజేంద్రుడిలాగ. మేనుకు తగిన నామం నామానికితగిన పేరు. పేరుకుతగిన పేరులూ అంటే ఏమిటో చెప్పుకో మామయ్యా?

నారయ్య;- (మెడ వాసవి వైపునకు త్రిప్పి) ఓస్ ఈ మాత్రం తెలుసుకోలేకపోతే నిన్నేం పెంచ్లాడతానే పిల్లదానా! గజేంద్రుడంతే ఏనుగంతబలం మీ మామయ్యకి ఉందన్నమాట. నిల్లంటే నావళ్లంతా నీటిబుగ్గన్నమాట అంటే మొదటిమాటను రెండవ మాటలో కొట్టేశావన్నమాట. మేనుకుతగిన నామం అంటే నా దేహానికి తగినట్టుగానే పంగనామాలు పెట్టేశానన్నమాట. నామానికితగిన పేరంటే నా పంగనామం లాగానే నా పేరులో ఉండే నారకూడా తగినట్లే తెల్లగా స్వచ్ఛంగా ఉందన్నమాట. పేరులు అంటే మన మెడనిండా కనబడుతూనే ఉన్నాయిగా పేరులు అంటే దండలు. బలే వరసలాడుతున్నావే మామయ్యని? సరేగాని నేనోక కథ వేస్తాను చెప్పుకుంటావు?

వాసవి;- వెయ్యి చూద్దాం.

నారయ్య;- "అంతర్వేది దేవాలయాలు మేము కట్టించలేదు ఆకిరిపిల్లి దేవాలయాలు మీరు కట్టించారో లేదో మాకు తెలియదు మీరువిపడగొట్టితే మేమివి పడగొడతాం" చెప్పుకోమరి చూద్దాం.

వాసవి;- (ఆలోచించినట్లభినయిస్తూ) ఏమిటేమిటి? మళ్లీ చెప్పు?

నారయ్య;- జాగ్రత్తగా విను మళ్లీ చెప్పుతా (మళ్లీ చెప్పుతాడు)

వాసవి;- ఏముంది! బాగా తెలుస్తూనే ఉందిగా? ఎవరేది నిర్మించినా పడగొట్టేవంతు మీదన్నమాట. నిర్మాణం ఎవడుచేస్తే మీ కెందుకు? పడగొట్టే విషయంలోమాత్రం మీకు భాగం ఉం

వన్నమాట. నాలాంటి వదిగొట్టైతే వీరిలాంటి వదిగొడతారు
సరేగాని మా బావగారూ! మీరు చిన్నప్పుడు సంస్కృతం ఏమైనా
చదువుకున్నారా?

నారయ్య;- ఓ బలే శేషులా పెద్ద పెద్ద మాఘాలు, ఫాల్గుణాలు
అన్నీ చాలా గ్రంథాలన్నీ మనకి తెలుసు.

కుసు;- ఏది బావగారు! ఏ శ్లోకం అనండి మీ వాగ్ధార మహా
గొప్పగా ఉంది.

నారయ్య;- (గొంతు సవరించుకుని) ఊఁ (మూలిగి)
"కస్తూరి తిలకం మంగలాడిదిగదా! బుర్రెతేమందేగదా!
గొరిగే భారమంతా వాడిదిగదా కుర్వంతు వాంమంగళం"

(వాసవి కుసుమ పకపక నవ్వుతారు)

కుసు;- ఇది ఏ గ్రంథంలోనండీ బావగారూ?

నారయ్య;- ఇది మాఘంలో నారదుడు ఆకాశంలోనుంచి దిగివస్తూ
పాడతాడులెండి.

వాసవి;- ఆ హా హా హా, ఏమి శ్లోకాలు, ఏమి భావతరంగాలు,
ఏదీ! మామయ్యా మరో శ్లోకం వదలు.

నార;- ఆఁ వదలటమేమిటి? దంచేస్తా తెలుసా! ఇలాంటి శ్లోకాలు
మా గురువుగారు బట్టీ వేయించారు. ఏ సభలోనైనా పాడుకో
వచ్చుని (గొంతు సవరించి సకిలించి)
"సూది దారం జంగమాడిదిగదా! గుడ్డైతే మందేగదా!
కుట్టే భారమంత వాడిదిగదా! కుర్వంతుమాం మంగళమ్॥"

కుసుమ;- ఆ హా హా హా (పక పక నవ్వి) మహా బాగుంది బావ
గారు! మీ విద్యకు తోడు దేహంకూడా బాగా రాణించింది.
హిమాలయంలాంటి దేహం సామాన్యుడికి లభిస్తుందా?

వాసవి;- నాన్నా! మామయ్యకు నీవిచ్చినపోలిక ఎంతో సరిపోయింది. "ఉపమాకాళిదాసస్య" అన్నట్టు కుదిరినది. (నవ్వుతూ) మామయ్యా! నీ మేను హిమాలయమనుకో, హిమాలయమంతా మంచుతో నిండిఉంటుంది. (నవ్వుతూ) నీ వంటినిండా నెర్లెగా సరిపోయింది. (తండ్రితో) హిమాలయం ప్రాక్ పశ్చిమ సముద్రాలు తాకిందన్నాడు కాళిదాసు, మామయ్య మేనుకూడ నీనుండి నాదాక తాకింది. పోతే హిమాలయం దూరానికి తెల్లగా కనపడుతుంది. మా మ య్య పంగనామాలుకూడ తెల్లగా కొట్టవచ్చినట్టు కనబడుతాయి. (నవ్వు) అ హ హ అంతేగా మామయ్యా!

నారయ్య;- బావా! వాసవిని నాకిప్పిద్దూ? ఈ సంగతి నీతో ప్రత్యేకం చెప్పుదామనుకునే వచ్చాను. నాకూ నీకుమల్లే కులగౌరవాలులేకపోలేదు. నాకేం సిరితక్కువా? కులంతక్కువా? రూపం తక్కువా? వయస్సులేదంటావా? నిన్నరాత్రి కల్లో నా ముండో పెండ్లాం...., కనబడింది. (దుఃఖంలో) ఎందుకిలా బాధపడతావు పెళ్లి చేసికో నీకష్టాలు చూడలేనంటూ, తెల్లవార్లూ నా ప్రక్క వదలకుండా తను ఏడుస్తూ నన్ను ఏడిపించింది.

కుసు ;- అవును చెడగా చెడగాగాని కాపరాలుకావు మరి. ఏమి చేస్తావులే. నీవైనా వాసవికి తగినట్లే ఉన్నావు. దానికి శివుడు లాటివాడిని పెండ్లాడాలని ఉంది. శివుడైతేనేం అయన్నిమోసే హిమాలయమైతేనేం సరే దాని ఇష్టప్రకారం చేద్దాములే.

వాసవి;- (నారయ్యవెనుక నిలబడి తలసవరిస్తూ) అలా అంటావేం నాన్నా! మామయ్యకూడా శివుడిలాంటివాడే. ఆ రాతిబండతో పోలుస్తావేం? మామయ్య నెత్తినిండా నీళ్లున్నాయిగా? (నారయ్య తల కొబ్బరికాయలాగ ఊపి నోటితో చప్పుడు చేస్తుంది - ఇంతలో నారయ్య జేబులో దువ్వెనచూచి అది

తీస్తుంది.) ఏమిటి మామయ్యో! దువ్వెన తెచ్చావే!! దువ్వెన కోడలికిచ్చి బహుమానమేమిటి? చక్కటి కొమ్ముదువ్వెన మహా బాగుంది మామయ్యా! గొడ్డుకొమ్ము దువ్వెనలు మహాచౌక గుడ్డావడి ఉంటాయి. ఇదిగో ఇది నాకియ్యవు?

నారయ్య:- ఆఁ ఆఁ ఒలేదానివి! దానితో నేఉంది మన బతుకంతా—

కుసు:- దేవశాస్త్రి మాటలాగ ఈ దువ్వెన ఎందుకు భావగారు?

నారయ్య:- ఆఁ అలా అనకు భావగారు! దేవశాస్త్రి మాటలో ఉండే దేవుడు ఎప్పుడో మోక్షమిస్తే ఈదేవుడు సద్యోఫలం, సద్యోఫలం భావగారు!

వాసవి:- మామయ్యా! దీనితో ఏంచేస్తావేమిటి?

నారయ్య:- వీణావాద్యం, వీణావాద్యం.

కుసు:- ఏమిటీ, ఈ దువ్వెన వీణలాగా మోగుతుందా ఏమిటి?

నారయ్య:- మోగుతుందా ఏమిటి మోతెత్తిపోతుంది మోత. ఇటు తేవేపిల్లా భావగారికి చూపిద్దాం (తీసి బరకటం సాగిస్తాడు) చూశావా పిల్లా! (సగం కళ్ళుమూసి)ఇది ఎలా వీణలాగా మోగుతోందో. ఇది మొండితామర దేహానికి బండభైరవ చటకాలే. (మళ్ళీ బరుకుతూ) అబ్బా! (కళ్లుమూసి) మేహాన్ని మించినసుఖం,. ఇటువంటి దేహాలన్నీ ఓ వేడినీళ్ల కాలనులో పారేసి ఓ సూభైచేతులు బ్రహ్మదేవుడుఇస్తే.

వానిదె పుణ్యజీవనము, వానిదె భాగ్యము,
వానిదె మోక్షరాజ్య లక్ష్మీవిభవంబు ఎవ్వాని
గృహాంతరంబునను మానని తీయని మొండితామరల్
తీటగ్రాక్షి ఆద్దురదతీర్చుటకై లభియించు దువ్వెనల్।

స్వాంతమవిశ్వాంతే మనకెప్పుడూ గణంరాము

దీన్ని ఆదిలో ఇంద్రుడు కనిపెట్టి నారదుని ద్వారా భూలోకానికి ఈ మహాశాస్త్రం పంపాట్ట వాడికి వాడికి పాకి పాకి ఇప్పుడీ చికిత్సావిధానం మన గ్రామం చేరుకుందిలే. మనం కూడా ప్రస్తుతం ఈ చికిత్సకి తగులుకున్నాం. (మళ్లి బరుకును)

కుసు ;- అదేమిటి ? అలా బరుకుతుంటే దేహంలోంచి పొగ బయలు దేరుతోంది!

వాసవి;- అదే ఘనసారం నాన్నా!

నారయ్య;- సరే సరసాలకేంగాని మనమిద్దరం పెళ్లి చేసుకుని ఆడుకుందాం ?

వాసవి;- ఏమాడతావురా వెర్రిమామయ్యా ?

నారయ్య;- చెమ్మచెక్క (వాసవిచేతులు పట్టుకొని) చారిడేసిమొగ్గ మల్లిసాల్లింగు తాతగారిదొడ్లో (వాసవి నవ్వుతుంది) ఏముం దంటే కాలుతీసి కడగాపెట్టవే పిల్లా. (ముద్దుపెట్టబోతాడు)

(వాసవి చేతులు విడిచి పెద్దఅద్దం చూపుతుంది. అందులో నారయ్య ప్రతిబింబం కనబడుతూ ఉంటుంది. వాసవి వెనుకకు, నారయ్య ముందుకూ నడుస్తారు. అద్దంలో దూరంగాఉన్న వాసవి చిత్రం కనబడుతుంది నారయ్యకు)

నారయ్య;- వాసవీ! నీకంటే నీ బొమ్మ ఎంత బాగుంది ? (చూపి) అదిగో పోదాంపద నీ బొమ్మను చూతాం (ఇద్దరూ పోతూ ఉంటారు. కొంతదూరం వెళ్లినతరువాత వాసవి అద్దంవదలి పారిపోయి తండ్రిని సమీపిస్తుంది)

కుసు ;- అమ్మా! నువ్వు లోనికిపద. నీచుడు ప్రపంచజ్ఞానమే మరచాడు. ఇదేమి అశుభమోగదా! ఏమిరానున్నదో వీడిని శాశ్వతంగా మన ఇంటికి రాకుండా గెంటేస్తాను.
(వాసవి పోతుంది)

నారయ్య:- (తెరలో) ఏమండోయి భావగారు! మీతో కొంచెం మాట్లాడాలి ఇలా వస్తారా కాస్త.

కుసు:- ఆఁ వస్తా. నీవు కదలకు. అక్కడేఉండు. (కుసుమగుప్తుడూ కూడా పోతాడు)

(తెరవాలుతుంది)

(ప్రథమరంగం సమాప్తం)



# వాసవీ కన్యక

## రెండవరంగం

[భాస్కరాచార్యుని చేతిలో భాగవతం ఉంది. అతని ప్రక్క కూర్చొని ఉన్న వాసవి భాస్కరాచార్యునినుండి గ్రంథం గ్రహించి పఠించటానికి తెరుస్తుంది. ఇతర వైశ్యులు, మరి యనేక వర్ణాలవారు సభ నలంకరించారు.]

భాస్కర:- నిన్నటి కాలక్షేపంలో మనం గజేంద్రుని దీనస్థితి విపులంగా చెప్పుకున్నాం. అటుపై చదువమ్మా వాసవీ?

వాసవి:-

శా॥ లావొక్కింతయు లేదు ధైర్యము విలోలంబయ్యె ప్రాణంబులున్
ఠావుల్ దప్పెను మూర్ఛవచ్చె దనువున్ డస్సెన్ శ్రమంబయ్యెడిన్
నీవే తప్ప నితఃపరం బెరుగ మన్నింపం దగున్ దీనునిన్
రావే ఈశ్వర కావవే వరద సంరక్షించు భద్రాత్మకా.

భాస్కర:- గజేంద్రుని బలం క్షీణించింది. ధైర్యం చలించింది. ప్రాణాలు ప్రయాణం చేస్తున్నాయి. శరీరం కృశించింది. ఓ భద్రాత్మకా ప్రభూ! యిట్టి యాపత్సమయములో నీవు తప్ప నన్ను రక్షించే వారెవరు?

అంటే మానవునికి మనుష్య సహాయం లభించే స్థితి వరకు ఈశ్వరుడు జోక్యం పెట్టుకోడన్నమాట. ఆ స్థితి అంతా ఉడిగి అప్పటికిని తన్నెవడాశ్రయించి యుంటాడో అట్టివానిని ఈశ్వరుడు తప్పక రక్షిస్తాడని యీపద్యంలో ఉన్న ధ్వని చెప్తోంది. అందితే జుట్టు అందకపోతే కాళ్లు అన్నట్లు అటు పైనైనంత మానవ సహాయం గ్రహిస్తూ మానవుని భజింపుతూ ఈశ్వరునే మోసం చేయటం తన్ను తాను మోసం చేసుకోవ

డనే కాదూ! నిరహంకారులై ఈశ్వరార్పణ బుద్ధితో జీవ కారుణ్య బుద్ధితో చరాచర సృష్టిని సేవించుకోడంచే అట్టి సేవ తిన్నగా ఈశ్వరునికే ముట్టుతుందన్నమాట. పేరుప్రతిష్ఠలకు పెనుగులాడుతూ, డబ్బులు సంపాదించినవాళ్ళ స్నేహం సంపాదించి పదవులకై ప్రాకులాడుతూ, లక్షలు గడించినవారు పైలక్షకు ప్రాకులాడుతూ, గుళ్లు, గోపురాలు కట్టించి పది మందిలో ప్రజ్ఞలు కొట్టుకుంటూ దరిద్ర ప్రజానీకాన్ని పీక్కు-తినటానికి పదవుల్లోకి చేరే రామబంధువులంతా రామరాజ్యానికి పునాదులు వేస్తారా? నిస్వార్థ బుద్ధితో మానవుని సేవిస్తే గజేంద్రునివలె అతను తప్పక రక్షిస్తాడని భావార్థం.

వాసవి:- ఆచార్యా! మానవుడు స్వసంఘ సేవ చేయడం ఎంతవరకు సమర్థనీయం?

భాస్క:- స్వసంఘ సేవకూడ పరోక్షంలో మానవ సేవయే కాదూ పరశ్రేయోభిలాషులై సహిష్ణుభావంతో స్వసంఘ సేవ చేస్తే అది విశ్వప్రేమకు పునాదులు వేస్తుంది. దేశంలోవుండే సంఘాలన్నీ సుభిక్షంగా ఉంటే దేశం పరమౌన్నత్యం అందుకుంటుంది. పరమత ద్వేషం కోరతగినదికాదు.

(వాసవి సహా అంతా ఉంటిమాల ప్రవేశము)
[గుడిధర్మకర్త మహేశగుప్త ప్రవేశం]

మహే:- ఏమిటి ఈ నత్త్రియోనకిరావటం! ఇది శివాలయమూ? కసాయివాడి కొంపా! పెద్ద, చిన్న, మంచి, శబర ఏం బొత్తిగా అక్కర్లా? తిన్నగా గుళ్లోకే రానటం. ఊఁ అందులో మాదిగాడికూడా కామోసు.

(పక్కతం శాస్త్రులు వేస్తాడు).

శాస్త్రి:- ఏమోయ్ మహేశగుప్తా! ఏమిటిది? నిజంగా మాదిగాడే! శాంభవ మహాదేవ శంభో శంకర పాహిమాం పాహిమాం!

ధుహే;- అయ్యా! పర్వతం శాస్త్రిలువారూ! తమరు కొంచెం సావధానంగా చిత్తగిస్తే ఈ వెధవని మూడు రెంటెల్లో గుడిబైటికి నెట్టేస్తాను. ఇదిగో గురువా! (ధ్వసగ్రాచార్యులితో) వీడు కొంచెం పురాణం నిలిపివెయ్యండి. మాదిగాడు మన గుళ్లోకి దూరేశాడు. కొంప మునిగింది. ఇంకే ముందంటోయి ఊరు చూస్తారేం లేవండి!

పర్వ;- (బిగ్గరగా) హరహర! మహాదేవ! శంభో శంకర!

మాల;- అయ్యా! మానవుడై పుట్టిన వాడికి దేవుడి దర్శనం చేసికోటానికికూడా ఒకరి యాజ్ఞ కావాలా?

గీ॥ మాలవానిగా భగవంతు డేలజేసె?
నన్ను, దేవుని దర్శింప నాకు లేదె
హక్కు? జీవరాసులకెల్ల నొక్క విధమ
గాదె? పరమేశ్వరుం డున్నగా నిజమ్ము!

ధుహే;- నువ్వు ముందు గుడిబైటకు పోయి మాట్లాడరా ముండ వెధవ. అరే! వీణ్ణి తాకటం ఎలాగ? గెంటకపోతే వీడు చస్తే పోతాడా? అయ్యా! శాస్త్రిలువారూ! ఈ పాపం అంతా గుడి ధర్మకర్తకే అంటుకుంటుందిగా?

పర్వ;- ఆ. నిస్సందేహంగా గుడిధర్మకర్తకే, అంటే నీకే. దీనికి బ్రహ్మాండమంత ప్రాయశ్చిత్తమౌతుంది. నీ సొంత ద్రవ్యంతో అదంతా పూర్తి చేసికోవాలి; తప్పుతుందామరి?

ధుహే;- అయ్యో! ముగ్గురు పెళ్లాలు చచ్చిపోయారని దేవుడి గుడి కట్టించి నాలుగో పెళ్లి చేసికొన్న అరవైయో పడిలో వీడి శ్రాద్ధం పెట్ట (ఏడుస్తూ) దేవుణ్ణి కాస్త మైల పడేసి నా కొంప తీశాడు మాల ముండాకొడుకు. దేవుడా! ఈ పెళ్ళాం కూడా దక్కదు కామోసు. చిల్లర యాపారం చేసుకొని సంపాదించు

కన్న కబ్బా పోయింది; శనీ పట్టింది. (పండ్లు నూరుతూ) ఈ కసాయి ముండాకొడుకు లంతా గుళ్ళోకి దూరి చచ్చిన గొడ్లని కుక్కల్నే కోస్తారు కామోసు. నా ఉసురు వీళ్ళకి తగల.

పర్వ:- సరే సంపాదించావు. కష్టించి చావు. లక్షలు గడించావు. ఏమి సార్థకం; దేశానికే వినాశకాలం వచ్చింది. మాల మాదిగాళ్ళంతా గుళ్ళోకి దూరటమే? ప్రాణాలైనా ఇస్తాముగాని బ్రాహ్మణ్యానికి దెబ్బ రానిస్తామా?

మహే:- మీ యనుగ్రహం ఉంటేనేగా మేము నాలుగు రాళ్లు పోగుచేసుకున్నాం. అసలు కోమటి-బ్రాహ్మలన్నారు. బ్రాహ్మలు మాత్రం మాకు అన్యాయం చేసిందేముంది? ఆళ్ళ సంపాదన ఆళ్ళది; మా సంపాదన మాది. ఒకళ్ల నొకళ్లు అడ్డం కొట్టుకుంటున్నారా?

పర్వ:- సరే గుప్తా! ముందీ చండాలుణ్ణి గుడిబైటికి గెంటి; దరిమిలా ప్రాయశ్చిత్తం సంగతి మనం చూసుకుందాం. ఈ పాపం నీకు చెందకుండా అంతా ఆ మాలాడికే చెందేటట్టు నేనో మంత్రం చెబుతాను. అది రోజూ జపిస్తుండుగాని. పైగా బ్రహ్మాండమైన ప్రాయశ్చిత్తం చేసికుంటావు. ఇంకేం భయం. పోయి. గెంటెయి మాదిగాడిని. ముందు గెంటెయ్యి.

మహే:- నీవు మంచిగా పోతావా పోవురా! అది కాదు; అలా ఉండు (లోపలకుపోయి కర్ర తెచ్చి మెడ పెట్టుతూ) పోరా. పోరా ముండమోపికి (కొట్టుతూ) కుళ్ళు కావాలట కుళ్ళు. ఉడత కేలరా ఊళ్ళో వార్తలని. పోరా వెధవ దూరంగా పోరా. గుడి బైటికి పోరా.

మాల:- (నిలువబడి) ఎవరు పోవాలండీ ధర్మకర్తగారూ?

పర్వ:- హరహర మహాదేవ శంభో! శంకర (గుడిలో గంటలు శంఖాలు మోగుతాయి.)

మహే;- (బిగ్గరగా) నువ్వుపోరా.

మాల;- నువ్వు అంటే.

మహే;- (వెక్కిరిస్తూ) నువ్వు అంటే (వ్యంగ్య సూచకంగా) ఈ తోలు మొగం అన్న మాట.

మాల;- తోలుమొగం నానుండి వేరుగా ఎలాపోతుంది? నేను తోలు మొగంలోనుంచి లేచిపోతే అప్పుడది వేరుగాపోతుంది. నేనందులో ఉండగా అది ఎలా వేరుగాపోతుంది?

మహే;- గొడ్డలిపెట్టి వేళ్లువేస్తే అదేపోతుంది.

మాల;- వేళ్లు దేన్ని వేస్తారు?

పర్వ;- నీ మొగాన్ని, మరి దేన్ని.

మాల;- మొగాన్ని వేస్తే నాకేమి బాధ! నన్ను మీరేమి చేయ గలరు?

మహే;- సరే. ఇది మెట్టవేదాంతలోకి దిగింది. ఏమి గురువా? ఇహ వీడిని బైటికి నెట్టివేస్తున్నా ఆజ్ఞ ఇప్పించండి.

భాస్క; నాకాజ్ఞ ఏముంటుంది? రేపటినుండి కుసుమగుప్తగారి స్వగృహములోనే పురాణకాలక్షేపం జరుగుతుంది. మానవులంతా జాతి మత విచక్షణ లేకుండా జ్ఞానామృతం గ్రోలవచ్చు

వాసవి;- మహేశగుప్తగారూ! సర్వం తెలిసినవారికి ఏమిటి చెప్పటం? మిమ్ముకోస్తే పాలూ, అతన్నికోస్తే రక్తమూనా?

మ॥ తలిదండ్రుల్ పరదైవతంబులనుచున్ తాత్పర్యమందెంచి, ని
ర్మలభక్తిన్ బరిచర్యలం బెసగు ధర్మవ్యాధునిన్ మాని నీ
తిలకంబైన యరుంధతీసతిని గుర్తింపంగ లేవయ్యా, మా
లలుగారే? పరమాత్మదృష్టిని సముల్ గాదే ప్రజల్ సర్వులున్॥

ఎందుకింత అహంకారం ధర్మకర్తగారూ! దేవదర్శనం చేసుకోవడానికి దేవుడిచ్చిన ఆజ్ఞ ఉండగా ఒకరియాజ్ఞ కావాలా?

మహే;- శ్రీరంగనీతులెన్నైనా చెప్పొచ్చు. ఈ జాతికివాళ్ళ చనువిస్తే రేపు దేవుడినెత్తిమీదే చచ్చినగొడ్లని కోసి నైవేద్యం చేస్తామంటారు, నీకేం తెలుసునమ్మా చిన్నదానివి?

వాసవి;- అలాటి అపచారాలు జరుగకుండా మనం శాసనం చేయించుదాం.

మహే;- ఆ రాజుకే పట్టింది గొడవంతా?

వాసవి;- మీ మాటలు నాకు బోధపడటంలేదు. అయినా ఈ నీచ ప్రాపంచిక విషయాలలో నేను జోక్యం పెట్టుకోను. నా నగరేశ్వరుడే నా సర్వస్వం మానవులకు ధర్మోపదేశం చేసి వారు పాతపాటలే పాడుతూ ఇహపరాలు రెండూ చెడగొట్టుకొని ఆత్మ నాశనం చేసికోవటంకంటే వారిని స్మశాన పుష్పంలాగా వర్జించి దైవదృష్టిలో కాలం గడపటం ఇహపర సాధకం. ఎన్ని చెప్పినా మానవుడు దేవత్వానికి చేరుకుంటాడా?

మహే;- అలాగైతే మీరంతా మెట్టవేదాంతంలోకి దిగారన్నమాట. సరే. (మాలదాసరి చొక్కా-చేతులు పైకెత్తిస్తూ) ఏరా నువ్వు పోతావా పోవా.

మాల:- అయ్యా! ఎందుకు మీకింత పరితాపం. ఇంతవరకూ మీరు దేహాన్ని అంటివున్న జీవుణ్ణి పొమ్మన్నారో లేక కేవలం జడ స్వరూపమైన శరీరాన్ని పొమ్మన్నారో తెలియక నిలబడ్డాను. ఇక నాకు తెలిసింది. ఆత్మజ్ఞానశూన్యులైనవారికి దేహమే ప్రధానంగదా, అయ్యా! నాదేవుడు నావెంటనే వస్తాడు.

(హరహరమహాదేవ అంటూ వెళ్ళిపోతాడు)

శాస్త్రి:- వాసవీ! నేటికి మనం కాలక్షేపం విరమిస్తాం. తిరిగి రేపు సాయంకాలం ఆరంభించెదాము.

వాసవి:- అలాగే కానివ్వండి. (పర్వతంశాస్త్రిలు, గుప్తాగారు అంతా వెళ్ళిపోతారు)

పర్వ:- గుప్తా! ఎంత అపచారం జరిగిందోయి. "వినాశకాలే విపరీత బుద్ధయః" అన్నట్లు మానవుడికి వినాశహేతువులు ప్రాప్తించాయి. గనుకనే ఇలాంటి పశుచర్యలు భారతవర్షంలో విపరీతంగా పెరిగినాయి. నిజంగా నీవంటి ధర్మకర్తలు లేకపోతే ధర్మం మొండికై కిందపడిపోయేది. మహా వాడు రెండుముక్కలు సొంద దుకువేసినట్లైనా అమాంతంగా శపించవలసిన దుర్గతిపట్టక తప్పేదికాదు సుమీ. ఈ సంఘాన్ని బాగుచేస్తామంటూ కొందరు మహాయోధులు బయలుదేరారు. వీరంతా సంఘాన్ని ఉద్ధరిస్తారట. ఏమిటి వీరి ఉద్ధరణ? మానవసేవే మాధవసేవ మాధవసేవే, మానవసేవఅంటూ డప్పులు కొట్టుకుంటూ గొంతులు చించుకోవటమే గాని బజారుల్లో, తిరుగాళ్ళల్లో ప్రాణాని పడిఉండే కుంటి,గుడ్డివాళ్ళనుగూర్చి ఎవడైనా ప్రక్కా పెట్టుకుంటున్నాడా? అసలు ఊరికే వీడికులాన్ని వాడు, వాడి కులాన్ని వీడు ఆడవాళ్ళలాగ దుమ్మెత్తిపోసుకోవటం తప్ప వీళ్ళకేముంది? ఏనాపాటా? అదుపులేని కష్టాలు అవధులు దాటాయియని "సర్వేజనాః కాంచనమాశ్రయంతే" అంటూ పెద్దలు ఊరికేఅన్నారా? విధవముండలకు పెళ్ళిళ్లు చేస్తాం. కర్ణుల్ని పుట్టిస్తాం, భీముల్ని పుట్టిస్తాం, భీష్ముల్ని కనిపిస్తాం అంటూ రొమ్ములు గుద్దుకొంటూ కొందరు మొనగాళ్లు తయారవుతున్నారు. వీళ్ళంతా ఇంతపిండానికి దబ్బులేరుకునే రకం. వీళ్ళల్లో అసలు వ్యక్తిత్వంఅంటూ ఉన్నవాడు ఉన్నాడను కుంటున్నావా గుప్తా! అసలు వీళ్ళల్లో కొంపలు కాలుతూఉంటే

రెండోసారికైనా పోస్తే పోయామన్నాడంటావా? కాకిపిట్ట తిండటం తప్పితే అసలు పిట్టల్లో ప్రయోజనమేవరంట? ఇదిగో ఇలా చూడావు? మన కుసుమగుప్త ఉన్నాడే వాడుకూడా ఈ కాకిపిట్ట సన్యాసులజట్టులో కలిసిపోయినాట్టగా?

మహే:- అయ్యా! శాస్త్రిలువారూ! నా గుండె కొట్టుకుపోతోంది త్వరగా ప్రాణప్రతిష్ఠ, ప్రాయశ్చిత్త విధానం తెలవివ్వండి.

సన్న్యా:- ప్రాయశ్చిత్తం ఉండకపోదులేవోయి గుప్తా! కాని ఈ ప్రాయశ్చిత్తం (ఆలోచిస్తూ) అసంభవ కార్యంగా కనబడుతోందోయి.

మహే:- సరే కానివ్వండి మహా అయితే ధనవ్యయమేగా అవుతుంది. ధనవ్యయం జరిగితేనేగా ప్రాయశ్చిత్తం అనిపించుకుంటుంది?

సన్న్యా:- (తలపై చేయిఉంచి ఆలోచించి) ఓహో హో హో అబ్బ! ఘోర కుంభీపాకనరకం "కర్మవిపాక గ్రంథం"లో చూడాలుసు ఆలయప్రవేశం కనక చేస్తే ఉత్సవిగ్రహానికి సమతూకంగలిగిన బంగారు విగ్రహం చేయించి బ్రాహ్మణులకి దానంచేస్తే ఆ పాపం అవగింజంతైనా ధర్మకర్తను అంటుకోదు అని మహాత్ములే చెప్పారు.

మహే:- (గుండెబాదుకుని) అమ్మబాబోయి ఆ విగ్రహం రెండుమళ్ళు బరువు వుంటుందండి. అంత బంగారువిగ్రహం దానం చెయ్యాలన్నమాటే! అలాకాదు శాస్త్రిలువారు మరోమాట తెలవివ్వండి

సన్న్యా:- మరోమాట తెలవివ్వటానికి ఇవేం బేరాలు సారాలు అనుకున్నావా ఏమిటి? శాస్త్రాలుచెప్పి ఉంచిన విశేషాలు చెప్పివేశాను. ఇష్టప్రకారమే చేసికో. యమదూతలు పట్టి, చీము, నెత్తురు, తోణికిసలాడుతూ ఉండే మహాజీవనదుల్లో పడేసి లాక్కుపోతూంటే నే వడ్డం వస్తానా! అది నీ ఇష్టం.

మహే:- అయ్యో! తేలికలో తేలికవిధానం ఏదైనా ఉంటే అది చూడ్దురూ!

పర్వ:- అలా దారికిరామరి (యోచించి) ఓ పదితులాలకు [illegible] గలవు?

మహే:- సరే కానివ్వండి. రోటిలో తలదూర్చి దెబ్బలకు జంకుతానా మరి?

పర్వ:- అయితే దీనితోబాటు దుర్గా సహస్రనామం చేయించటం మంచిది. ఆలా జరక్కపోతే నరకానికి పోకపోయినా నరక దర్శనమైనా తప్పదు. మరి నేను ఇంటిపురోహితుణ్ణి. ఆ విగ్రహాన్ని నాకే దానంచేసివేయకూడదూ? ఈ గ్రామంలో ఉండే బ్రాహ్మణుల్లో ఒక్కడూ బ్రాహ్మణీకం ఉన్నవాడులేడు. తద్దినాలకు గారెముక్కలు విరవటం తప్పితే వీళ్ళకు తెలిసి చచ్చిందేదైనా ఉందా? ఈరకమంతా మేతబ్రాహ్మణులేగాని కూత బ్రాహ్మణులం మనం తప్పితే మరెవ్వరున్నాము?

మహే:- సహస్రనామ పూజకూ ఏంకావాలసి ఉంటుందండి?

పర్వ:- ఆఁ దానికేముందిలే! అయిదువందలనుండి బ్రాహ్మణ్యానికి షడ్రసోపేతంగా ఇంత అన్నదానమేగా, అయిదువందల బ్రాహ్మణ్యం చేసే భోజనం అయిదుగురు తిని "జేవ్" మనే వాళ్ళని దిట్టమైన వాలీదున్నపోతుల్లాంటి బ్రాహ్మణుల్ని నేను చూస్తానుగా? నీకు దిగులెందుకు? అయినా అవిమాత్రం ఎందుకు? ఆ అయిదుగురు బ్రాహ్మణులు భుజించేది మన ముక్కళ్ళమే అవలీలగా దంచేస్తాం. స్వయంపాకమంతా మన ఇంటికే... .. ఇదా జాబితారాసికో (గుప్త రాస్తాడు) వేసికో ఓ అరబస్తా కందిపప్పు, ఎట్లాపోయి ఎట్లావచ్చినా పడిఉంటుంది. ఓఅరబస్తా పెసరపప్పు, రెండుమళ్ళ ఆవునెయ్యి. అబ్బా! నెయ్యి

పేరుచెప్తితే నోరూరుతోందోయి గుప్తా! ఖారలేనికూ దయ్యప్పుకూడన్నారు. అయితే ఏంలాభం? ఈ వెధవ కక్షి నెయ్యి కడుపులో తిప్పేస్తోంది. తరువాత (ముఖం చిట్లించి ఆలోచిస్తూ) దేవుడు చాలామేలుచేస్తే ఓతూమెడు మినుముళ్ళు రాయి. (ఆలోచించి) అన్నట్టు (ఉలికిపడి) రెండుమళ్ల వంచదార, ఓమణుగున్నర మంచిబెల్లం, రెండుడబ్బాల నువ్వుల నూనె, ఓ వెయ్యి అప్పడాలు రాయి ముందు. తర్వాత మరచిపోతాం. ఓబస్తా ఒడియాలు, ఓ వంద కూష్మాండాలు అంటే గుమ్మడికాయల్లే. ఆఁ వేశావ్. ఊఁ నాలుగుబస్తాలు బియ్యం సరే కురదలా ఉంటే తర్వాత చూసుకుందాములే.

మహే:- (జాబితాముగించి) చిత్తం అలాగే కానివ్వండి స్వప్నంలో మోక్షం అన్నారు. అంతా బాగానేకుదిరింది (గుప్తకొడుకు తెరలో) నాన్నోయి! నాన్నా! మరే, మరే ఇప్పుడు గుళ్లోకి వచ్చింది పూలబ్బాయికాదుట. మరే. మరే వాడు మన పర్వతంశాస్త్రిలుగారి పెద్దకొడుకే అలా వేషంవేసికొచ్చాట్ట.

మహే:- (బిగ్గరగా) బతికాన్రాబాబూ! (వడిగాపోతాడు)

పర్వ:- (బిగ్గరగా) చచ్చాన్రాబాబూ! మాలాళ్లు గుళ్లోకివస్తే ఎంత బాగుంటుంది? (వడిగాపోతాడు)

(తెర పడుతుంది.)

రెండవ రంగం సమాప్తం.

# వాసవీ కన్యక

## ఐదవరంగం

(బాలనగరులు పాడుతూ ప్రవేశిస్తారు)

పుండరీకాక్షుడు:- వైశ్యవీర యువకులారా! వైశ్యజాతిని ఈనాడు ఎదుర్కొంటున్న విషమసమస్యను ఎదుర్కోటానికి నిశ్చిత నిర్ణయం చేయడమే ఈనాటి మన యువజన మహాసభ ఆశయం. ఉత్కృష్టఆశయం సాధించటానికి మీ మీ నిర్ణయాలు వినుపించితే తదనుసారమైన కార్యకలాపాలు సాగించటానికి వీలు పడుతుంది గాన అలా చేయగోరుతాను.

(విజయుడులేచి)

విజ:- ఈ చిక్కుసమస్యను పరిష్కరించాలంటే శారీరకంగాను, ఆర్థికంగాను, మానసికంగాను, మనం ఎంతో వృద్ధికి రావలసి ఉంటుంది. రాజు కుసుమగుప్త గృహానికి అతిథిగా రావటం, త్రిలోకసుందరియై త్రిజగన్మాత అంశనుగ్రహించి మానవ లోకానికేతెంచిన వాసవిని మోహించటం, అందులకామె నిరాకరణం, అటుపై రాజాగ్రహం, తత్కారణంగా వైశ్య జాతిని నేలమట్టం చెయ్యాలని అతనిదృఢసంకల్పం మీకందరకు తెలిసిందే. రాజు మహాబలశాలి అనే విషయం మనకందరకూ తెలిసిందే. అయినప్పటికి కర్తవ్యపరాయణులైన వీరవైశ్య యువకులు పరిస్థితులకు బానిసలుగాక స్వధర్మ నిర్వహణానికి అనువైనమార్గములు నిర్ణయిస్తారనే దృఢసంకల్పంతో సాంఘిక, ఆర్థిక, అభివృద్ధికి ఉపయుక్త నిర్ణయంచేస్తూ రాజును ఢీకొనటానికి తగిన విధానంకూడా నిర్ణయించే బాధ్యత కుసుమ

గుప్తగారి కుమారుడైన విరూపాక్షగుప్తగారు స్వీకరిస్తారని కోరుతున్నాను.

విరూ:- వైశ్యకుల యువకులారా! ఈ సభలో విరూపాక్షుడు నవ్య సందేశాన్ని ఏమీ తేలేదు. స్వధర్మ నిర్వహణం, ప్రాకృతిక జీవనపథంలో నవచైతన్యానికి అబాధ్యగమనం ప్రసాదించు తుందని భారతీయ పౌరాణిక ఐతిహాసికసంఘట్ట పరంపరలు వేనోళ్ళ చాటుతున్నాయి. లతాంత స్వర్ణవిగ్రహ తేజంతో, సర్వాంగసౌందర్య తరంగమాలికలతో, పరమేశ్వరీసాన్నిధ్యం నుంచి అప్రతిహతగమనంతో మనసాన్నిధ్యానికి తరుక్కున మెరసిన మెరుపుతీగలాగ ప్రవేశించిన అమర వాసవీజ్యోతి క్రమ క్రమంగా శైశవ, బాల్యావస్థలు గడచి నేటికి పదునెనిమిది ఏండ్ల ప్రాయంలో ప్రవేశించి నగరేశ్వర ధ్యానసంలగ్న మానస్కురాలై వివాహ విముఖత్వంతో నగరేశ్వర కరుణాకటాక్షాలకు ఎదురుచూచే మన వాసవీకన్యకకు ఈనాడు వాటిల్లబోయే ప్రమాదం మీరంతా గుర్తించేఉంటారని నాభావం. (గుప్పిలి బిగించి) కర్తవ్యపథం ఎంత కఠినమైనదో విద్యావివేక సంపన్నులైన మీకు హెచ్చుగా చెప్పటం అనవసరం. అప్రస్తుతం కూడాను. వాసవి నాచెల్లెలు, తత్సంబంధాన్ని పురస్కరించుకుంటూనే నీమాటలుఅంటే నాకంటే విరగపడువు వేరే ఉండబోదని విన్నవిస్తున్నాను. ఏనాడైనా, ఏజాతివాడైనా స్వజాతీయ దృక్పథంవీడి, దేశకల్యాణభావంవిడిచి కుత్సితుడై సంకుచిత నీచ భావప్రేరితుడై నాకులం, నామతం, నాజాతిఅంటూ వ్యర్థవిరాలాపాలతో కాలయాపనచేస్తూ క్రియాశీలుడుగాక ఇటు స్వసంఘాన్ని గాని అటు దేశాన్నిగాని సేవింపక విశ్వప్రేమ. జీవకారుణ్యబుద్ధి వర్జించి చిల్లరవ్యాపారాలతో అల్లరి జీవితం మేళవింపజేసి తానో మేధావిలాగా జ్ఞానవంతునివిధంగా తన్నుతానుమాత్రమే గుర్తించుతూ పరోపకారంగాకాని పరా

పకారంగాకాని చేతగాక మలినధారణచేసిన మానవజీవాలు ఈ మన వైశ్య యువజనసభలో లేవనుకుంటాను. అలా స జీవమైనా ఈ వీరవైశ్య మహాసభలో పడిఉంటే కనకంటూ వృత్తమై యమపట్టణ భయంకరబాధల మరిపించే అతిభయా నక కర్తవ్య పథావలంబులైన వీరవైశ్య యువకులకొరకే ఈ మహాసభగాని తదన్యులనుకాదని అట్టివారు గుర్తించాలని నా మనవి. నాజాతి, నాదేశం, నాధర్మంఅంటూ సుభాషితాలు చెప్పుతూ రొమ్ములువిరుచుకునేవారు నిజంగా ఆజాతికి, ఆదేశా నికి, ఆధర్మానికీ, తీరని ద్రోహంచేసినవారవుతారని నామతం. వాడే జాతిద్రోహి, వాడే దేశద్రోహి, వాడే ధర్మద్రోహి;

వాసవి పావనచరిత్ర, అకళంకతేజోరాశి, ప్రాకృతిక అస్థిర సర్వసౌఖ్యాలు వర్జించి, అచంచల దీక్షతో నగరేశ్వర లక్ష్య సాధనలో తన్మయావస్థను చేరుకున్న అపరపరమేశ్వరి. అట్టి యామెను మృగయా వినోదార్థం బయలువెడలిన రాజ మహేంద్రి పురపాలకుడైన విష్ణువర్ధనమహారాజు కామించి నా తండ్రియైన కుసుమగుప్తుని నిర్బంధపరచాడు. వాసవి వివాహ

వైముఖ్యాన్ని ముందే మనవిచేశానుగదా. ఆస్థితిలో నాతండ్రి ఏమిచేస్తాడు ? ఏమిచేయగలడు ? ఈ పాణిగ్రహణం జరుగపోతే వాసవి, ఆమె జనకుడు, ఆమె కులం అందరూ వధార్హులం టూ వర్తమానంచేశాడు. ఈ ముప్పు వాసవికేగాదు. తత్కా రణంగా మొత్తం జాతికే ప్రమాదం వాటిల్లింది. మన వైశ్య జాతి ఒకరికి అపకారం తలపెట్టదు. విశ్వప్రేమయే దాని లక్ష్యం, మన సంఘసేవ, విశ్వప్రేమ కావ్యానికి తొలిపలుకు. ఇట్టి విశాలదృక్పథాన్ని అణగద్రొక్కి సంఘాన్ని సంకుచిత మార్గాలకు మళ్లించటానికి, దాని ఉత్తమ లక్ష్యాలను రూపు మాపి వీరిలో అంతఃకలహాలు, గృహకల్లోలాలు, ఏర్పరచి వారి చిత్తప్రవృత్తినే తారుమారుచేసి చీలదీసి వాసవిని చేపట్ట

కాబట్టి రాజు చేస్తున్న కృత్రిమ ప్రయత్నాలను భంగపరచటానికి మన ఆర్యవైశ్య యువకులంతా నడుములు బిగించి వాసవి పావనలక్ష్యానికి భంగపాటు తెచ్చే ప్రతిప్రయత్నాన్ని మనం ఎదుర్కోవాలి. ఈ ప్రయత్నంలో పాల్గొనటానికి తన్ను మనుష్యునిగా తెలుపుకునే ప్రతివానికీ బాధ్యత ఉంది. రాజు వాసవిని కోరటం, నగరేశ్వర తత్ప్రయత్నంలో ఉన్న వాసవి నిరాకరించటం, తత్కారణంగా తండ్రిగారి నిరాకరణం. తత్ఫలితంగా సంఘసభ్యులమైన మనయందరి తిరస్కారానికి గురియైన రాజు కుపితుడై కోపకషాయితనేత్రాలతో ముల్లోకాలు మాడ్చివేసేట్లు గర్జనలు చేస్తూ సైన్య పరివారసమేతుడై మన పట్టణ శివార్లలో మకాము చేసియుండిన సంగతి మీ కెల్లరకూ విదితమేగదా? మనంకూడ శారీరక, మానసిక బలాభివృద్ధిచేసి అస్త్ర శస్త్ర విద్యలు అభివృద్ధిపరచటమేగాక రాజు సైన్యంలో భేదంపుట్టించి అంతఃకలహాలు వర్ధిల్లజేసి కొందరూ రాజుపై కపటప్రేమజూపి అతని రహస్యాలను అర్థంచేసికునేవారు కొందరూ [illegible] రాజుపై విరుచుకుపడి సర్వసంహారంచేసి వాసవి పావనలక్ష్యాన్ని సాధించటానికి సిద్ధపడ్డ వైశ్య యువకులంతా ముందుకు రావాలి. వీరకంకణధారులై ఒక్క కత్తిపట్టు దేహంలో మిగిలియున్నా శత్రుసంహారానికి వైశ్య యువకులు వెనుదీయరనే ఉత్తమాదర్శాన్ని భావి వైశ్య చరిత్రకు మనమందజెయ్యాలి మన ఆదర్శమే వారిని ప్రేరణకలిగించేదిగా తయారుచెయ్యాలి. ధర్మసంస్థాపనకోసం సర్వస్వం బలిదానంచెయ్యాలి. ఈ తీర్మానానికి మీరంతా సమ్మతించినట్లు మాకు తెలియటానికి ఒక్క పర్యాయం శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరికి జయధ్వానం చెయ్యండి. వ్యతిరేకులు ఇప్పుడే సభను విడిచిపొండి.

అందరూ:- శ్రీ వాసవి కన్యకాపరమేశ్వరికి జయ్. (తెరవాలుతుంది)

# వాసవీ కన్యక

## నాల్గవ రంగం

వాసవి:-(సేవాశ్రమం వాసవి పాడుచూ ప్రవేశిస్తుంది)

ఉ॥ సాంబశివా! మహేశ! విభు! శాశ్వత! శంకర! సత్యస్వరూపా!
త్ర్యంబక! భక్తవత్సల! కాలకలనా! సకలైక నాయకా!
సంబరమున్ బొసంగ నొక సారి దయన్ కరుణింపుమయ్య శ్రే
రంబుల నెంచబోక నగ రాజ తనూజ మనోజ్ఞ భాజనా.

పరమాత్మా! నిత్యనూతన శోభతో, అనంతకాల ప్రవాహంతో కూడిన చరాచర సమన్వితమైన సృష్టినంతా యుద్ధరంగమే సృష్టిరంగంగా సృజించావుగదా! మానవునితో మానవునికి వైరం. మానవులతో జంతువులకు వైరం. జంతువులతో జంతువులకు వైరం సర్వసృష్టిలో సర్వానికి వైరం. సృష్టికర్తతో సర్వసృష్టికీ వైరం. ఈ వైరమే లేకపోయిన ఏ నాటకమున్నది? నీ కానందమెక్కడ? జగన్నియంతా నీవు వినోదప్రియుడవుగదా! నీవు నిర్మించిన బొమ్మలాటలో నీవాడు కొనటమా! పసిపాపల విధంగా బొమ్మరిండ్లు కట్టటం, సంతసించటం, కూలదన్నటం, ఇందే నీకు మహదానందం కలుగు గదా!

1 రోగి:- తల్లీ వాసవీ! ఇలా ఎంతకాలం మాకీ కష్టగాథ! లోకాని కంతా రోసిపోయిన మా బతుకెందుకు తల్లీ! అనాథుల పాలిటి కల్పవృక్షంలాగ నీవు మాపాలిటి దేవతవై వెలిశావు. కాని.........

వాసవి:- అన్నా! నీవు చింతించకు. నీ వ్యాధి చాలవరకు శమించి నట్లున్నది. (విచారంతో) ఇనుమునుబట్టి అగ్నికి సమ్మెటపెట్ట

న్నట్లు దేహాన్నిబట్టి జీవునికి బాధ. ఈ బాధ ఒక్కనాటిది కాదన్నా. అనేక జన్మ కర్మ పరిపాకఫలం ఇది. అనుభవించక తప్పుతుందా బాబూ! (కట్టువిప్పి) నాయనా! చూచావా ఈ గాయము? దీనిలో నీరు తగ్గినది. ఇంక కొద్దికాలంలోనే నీవు ఇల్లుచేరవచ్చు.

క్షయ రోగి:– అమ్మా! ఈ క్షయబాధ నాకుకాదు. నా శత్రువుకు కూడా వద్దమ్మా! గతరాత్రంతా నేను పడినబాధ నాకే తెలుసు. ఆభగవంతుడికే తెలుసు. (ఏడుస్తూ) ఏడుకొండల వాడికి ఒడ్డికాసులు ఇస్తానన్నా అలివేలుమంగమ్మకు పట్టు చీరెలు కొంటానన్నా వేంకటేశ్వరస్వామికి తలమీది జుట్టంతా ఇస్తానన్నా. ఎన్నిమొక్కులు మొక్కినా నాబాధ ఎవ్వరూ తీర్చలేదు. ఇక మీ యాశ్రమంలో మాత్రం కుదురుతుందా! లేదు లేదు. నేనిక వెళ్లిపోతాను తల్లీ!

మానవి:– తండ్రీ! నీకు పెద్దతనంలో కూడనివ్యాధి కలిగింది సుమా (సమీపించి) అయ్యో! ఈ జీవి ఎంతబాధ పొందుతున్నది. జగన్నియంత! మానవులకిట్టిబాధలు కలిగించి నీవు పొందే ఆనందం ఎలా వుంటుందో బోధపడదుగదా! మానవసేవ చేయుటయే మానవ విధి. సర్వమానవ సౌభ్రాతృత్వంవల్ల విశ్వశాంతి ఏర్పడుతుంది. ఈ పృథ్విపై ఇక మానవునికి చేయ వలసిన కార్యం ఏముంది? ఈశ్వరునిపై దృష్టినిల్పి మానవ సేవ చేయుటంకంటే మానవునికి వేరుకర్తవ్యం ఏముంది?

క్షయ రోగి:– ఏముందా? రోగాలు నయంచేస్తామని లొట్టకొట్టటం, గొప్పగొప్ప డబ్బున్నవాళ్ళని పిలుచుకురావటం, పేరు సంపాదించటమున్నా, కాకపోతే నేనిక్కడికొచ్చి ఎంతకాలమైంది? వచ్చేవారూ, పోయేవారూ, ఉపన్యాసాలు కొట్టేవారూ,

తప్పితే మాకేమైనా ప్రయోజనం వుంటాదా అసలు? నేను యిప్పు బయలుదేరి వెళ్ళిపోతాను.

వాసవి:- (కన్నీరుతో) హే జగన్నియంత! మానవుని ఎంతకోపాన్నికి తెచ్చావు? తనకున్న బాధకు విసుగెత్తిపోతున్నాడు పాప మీ జీవుడు. (రోగితో) తండ్రీ! మానవునికి అజ్ఞానం కొన్నింటి ఉంటుంది. అది ఎప్పుడో తన ఇష్టానుసారం విజృంభించి అతని హృదయాన్ని కల్లోలపరుస్తుంది. ఇలా అనడంలో నీ తప్పే మున్నది? నీలోవుండే అజ్ఞానం అసత్యాన్ని సత్యంగా మాపు తోంది. (కట్టువిప్పి) ఇది ఏమాశ్చర్యం! నీగాయమేక్కడ? నేను కలమాడటంలేదుగదా!

శివ రోగి:- (ఆశ్చర్యంతో) తల్లీ! ఈ సత్యం తెలుసుకోలేకపోయాను. నిన్ను తూలనాడాను. నాతప్పు క్షమించుతల్లీ! (కాళ్ళపైబడి) మానవకులపావనీ! నేను ధన్యుడనైనాను, నా సర్వపాపాలు నేటితో నశించాయి. ఇంతటి ప్రత్యక్షదేవతను భారతవర్షానికి కని సమర్పించిన వైశ్యజాతి ధన్యతనొందినది తల్లీ! భరతఖండం నిఖిలప్రపంచంలో ధృవనక్షత్రంలాగ జాజ్వల్యంగా ప్రకాశించు తుంది, నీకు యావద్భారతవర్షం ఎంతో ఋణపడియున్నదన్న మాట. తల్లీ! నాకిక సెలవు దయచేయించు, సుఖంగా భార్యాపుత్రులతో కాపురం చేసికుంటాను.

వాసవి:- నాయనా! నీవింత పరితాపం చెందటమెందుకు? నీవు తోచినవిధంగా సత్యమేపలికావు. సత్యదేవతనారాధించేవారికి ప్రళయకాలంలోకూడా సౌఖ్యమే కలుగుతుంది. వ్యాధిగ్రస్తుడ వైన నీమాటలకు నాకు సంతాపంలేదు. కోపమనేది మానవ జాతికి లక్షణమేకాదన్నా! పిశితభక్షణచేస్తూ రుధిరపానంచేసే జంతువులకది స్వాభావికం. సాత్వికాహారమే స్వీకరిస్తూ బుద్ధి వికాసంకలిగిన మానవజాతికి కోపతాపాలు అస్వాభావిక విష

యాలు. ఇక నీవు భార్యాపుత్రాదులతో సుఖంగా కాలక్షేపం చేసికోనాయనా! (చేయెత్తి దీవిస్తుంది)

శివ రోగి;- (పాదాలకు నమస్కరించి) అమ్మా! శెలవుతీసుకుంటా. పవిత్ర భారతవర్షంలో నీవంటి మహాతల్లులెందరో పుట్టాలని దేవుని ప్రార్థిస్తున్నాను. ఇక శెలవు (రోగిపోతాడు)

వాసవి;- (ప్రేక్షకులుచూచి) అబ్బాయి! మీరంతా ఈ రోగుల్ని లోనికి చేర్చండి నాయనా! (సేవకులలాచేస్తారు)

(భాస్కరాచార్యులు ప్రవేశం)

భాస్క;- అమ్మాయిగా! వాసవీ! నీ త్యాగబుద్ధికి బ్రహ్మానందం కలుగుతోందమ్మా! నిజంగా నీ జన్మవల్ల వైశ్యకులమేకాదు. సమస్తభారతవర్షం, నిఖిలప్రపంచంకూడా ధన్యత చెందినదంటాను. ఝంఝూమారుత ప్రవాహ సమయంలో సంక్షుభిత సాగర తరంగాలపై ప్రభాతసూర్యకిరణంలాగ స్వర్గసీమ నుండి భూమండలానికి ఉరికివచ్చిన దివ్యకిరణంలాగ నీవీలోకానికి దిగి వచ్చావమ్మా! నీ యాశ్రమం, నీ యనాథమానవసేవ, నీ జీవకారుణ్యబుద్ధి, నీ సర్వమానవ సౌభ్రాతృత్వభావం, నీ సేవాతత్పరత, నీ యాధ్యాత్మిక జీవనతత్వం, నీ విశ్వప్రేమ. ఈనాడు వాడవాడ పల్లె పల్లె వ్యాపించిపోయింది. నీ పరమేశ్వరీ సేవాగృహం నిఖిలభూమండలానికి అమరగానంలాగా, అమృతవర్షంవలె అరుంధతీ నక్షత్రవిధంగా శాశ్వత స్వర్గపక్షిలాగ ప్రపంచానికి పవిత్ర సౌఖ్యాన్ని ప్రసాదించుతోంది.

ఉ॥ మానవసేవయే యగును । మాధవసేవయటన్న వాక్యమున్
మానుగ సార్థకమ్ముగ నొ॰। నర్చితివమ్మ! నిజమ్ము వాసవీ!
మానినులందు నీవు తల ।మానికవై వెలుగొందుచుందు, నీ
దీనజనానుకంప విను । తింపగ నెవరికైన శక్యమే॥

వాసవి;- ఆచార్యా! మీయనుగ్రహ విశేషమే లేకపోయిన నేనింత పవిత్ర ప్రశంసకు పాత్రురాలను కాగలిగేదానినా! వాస్తవానికి ఈ పరమేశ్వరీ సేవాగృహానికి మీరేకాదా వాస్తవిక అధ్యక్షులు, గురువుల యనుగ్రహమే శిష్యుల పురోభివృద్ధికి కారణం.

భాస్క;- అది అలా వుండనీ. ఆశ్రమ నిర్వహణంలో నీకేమైనా సహాయం వాంఛనీయమైతే అందుకు నేను సిద్ధం. ఈ పవిత్ర సంస్థకు ధనసహాయం చేయటానికి మన పట్టణ వైశ్య సంఘమే గాక యావద్భారతవర్షం సిద్ధంగా ఉంది.

వాసవి;- ఈ సేవాగృహభారమంతా నా జగదంబయే మోస్తుంటుంది. ఇందుకోసం మీరు పరసహాయాన్ని అపేక్షింప నక్కర లేదు. పరులనాశ్రయించిన విష్ణుమూర్తివంటి పెద్దవాడు వామనమూర్తి కావలసివచ్చిందికాదూ? ఇదే ఆశ్రయింపుంటే దోషం. ఈ యాశ్రమం స్వయంపోషకంగా ఉండేటట్లు నేనొక ప్రణాళిక తయారు చేశాను. (తెరలో) వాసవీ! వాసవీ!

వాసవి;- నాన్నగారూ! ఇదే వచ్చా. ఆచార్యా! నమస్కారం ఇక నాకు సెలవు.

భాస్క;- మంచిది నేనుకూడా ఇటేవస్తాను. పురాణ కాలక్షేపానికి మీ నాయనగారు ఎదురుచూస్తూ ఉంటారు. (ఇద్దరూ పోతారు)

(తెరవాలుతుంది)

(నాల్గవ రంగము సమాప్తము)

—o—

# వాసవీ కన్యక

## ఐదవ రంగం

(ప్రవేశం విష్ణువర్ధన మహారాజు విదూషక సహితుడై)

విదూ:- ఎన్ని చెప్పినా పరగృహోల్లోదూరటం, పరభార్యాపహరణం, అనేవి తాత్కాలికోత్సాహం పుట్టించినా స్థిరసౌఖ్యం పూర్ణానుస్వారమే.

రాజు:- ఈ దౌర్బల్యం నాకేఉందంటావా! ఎందరెందరు మహానుభావులీ భావదాస్యానికి సిద్ధపడలేదు.

సీ: యమ నియమాదులూని వన । మందు మహాబ్దము లొక్కటిటునన్
విమల తపోవిధిన్ సలుప । నేర్చిన దివ్యమునీంద్ర చంద్రులే
యువతి లతాంగులన్ మరగి । తన్నుడిన్ వినలేదె నీవు? దో
సమయము చేరి యట్టివని । సంయమివర్యు లొనర్తురే సఖా!

పరాశర విశ్వామిత్రాదులవంటి ముముక్షువులు, జ్ఞానధనులు ఏమైనారు? సాక్షాత్తు ఆదిశంకరునికే ఈగతి తప్పలేదుగదా!

విదూ:- ఔలే. ప్రతివాడు తన తప్పులు దిద్దుకోటానికి ఇలా కృత్రిమ గాథలు కల్పించుకుంటు తన బాటలో తిన్నగా పోతూఉంటాడు. నీవు చెప్పినగాథలన్నీ కవీశ్వరుల కల్పనాప్రపంచంలో వేగా తామ వలచింది రంభ, తాను మునిగింది గంగ.

రాజు:- వాసవి రంభయే కాదోయి మిత్రమా! బ్రహ్మదేవుడెప్పటి దాకా ఇలాటి సృష్టిచేసి ఉండడని నాభావం. ఆ తుమ్మెదరెక్కల్లాంటి ముంగురులు, నునుపై ఏటవాలుగా సాగిపోయిన నాశికం, దొండపండులాటి ఎఱ్ఱని పెదవులు, అద్దాలవంటిచెక్కిళ్లూ, కొండకొనలు మరపించే కుచద్వయం చూస్తే కొమ్ములు మొలి

చిన మొగాడైపోయి విడవటానికి? రామాయణ స్త్రీ[illegible]ఫలించి సాత్వికాలంకారంతో మృదుమధురంగా మాట్లాడుతోంది అబ్బ! అమృతవర్షమేగా? దేహకాంతికి తోడు అమాయక భావం బంగారానికి పరిమళం అబ్బినట్లుంది.

విదూ;- నా రాజ్యం రామరాజ్యంచేస్తానంటూ డప్పాలుకొట్టటం కాదు. ఇది ప్రభుత్వం మరి. రాజధానిపట్టణంలో కూచిపూడి నాట్యకత్తెలతో తైతక్కలాడటం, త్రాగి తందనాలాడటం పరిజల్లో బయలుదేరే అవినీతికి దారులుతీయటం ఎక్కడైనా ఒంటరి చక్కనిపిల్ల కనబడితే ఎత్తుకుపోవటం, ఇవేనా సి రామరాజ్య లక్షణాలు. ఇందులో కొన్ని గుణాలు కొంత లేక పోవచ్చులే కంగారుపడకు.

రాజు;- తప్పులు ప్రతిచోటఉంటాయి అవే నాలోకూడాఉన్నాయి. తప్పుచేయనివాడు దేవుడేగా? నేను మనిషిని.

విదూ;- (నస్యం పీల్చి) తప్పుచేసేమనిషివైతే ( దగ్గు ) మరి రామ రాజ్యమోఅంటూ మోతలెత్తటం దేనికంట! రాజ్యంలో ఉండే కన్యలందరి కన్యాత్వం హరించటమే సేవనా? ఛత్ ఏమీబాగాలేదు మిత్రమా!

రాజు;- నాలో జ్ఞానం ఎంతఉందో అజ్ఞానంకూడా అంతేఉందని తెలిసికో. అస్థిరమైన ప్రపంచగమనం తెలుసు. కామవికారం ఎంత ఉధృతమైనదో, ఎంత హేయమైనదో అదికూడా నాకుతెలుసు అయినా ఇందులో నా తప్పుమాత్రం ఏముంది? స్వయంగా వాసవి తండ్రికి నాయభీష్టం ఎరిగించాను. వాసవి పెండ్లికి విముఖత్వంగాఉన్నట్లు ఆమెతండ్రి చెప్పుతాడు. ఎలాగైనా ఆమెకు వివాహంపట్ల ఉత్సాహం కలిగించటమే ఇప్పటి మన కర్తవ్యం ఇందు ఎదురొక్కనే ఏ వైశ్యుడైనా నా యభీష్టంలో వధార్హుడే.

విదూ:- నీవెన్ని చెప్పినా ఆమె తిరస్కారమే నీకు శరణ్యం. అది నాకు తెలుసు. కామాంధత్వంవల్ల నీకు లోకం తెలియటం లేదు మిత్రమా! అయినా ఈ కామ వికారచేష్టలకు హద్దు కద్దా? ఎంతమాత్రుల్లాగా పోయినకొద్దీ లాగుతూనేఉంటాయి. వాసవి సామాన్యస్త్రీ అనుకొన్నావా? ఆమె సాక్షాత్తు అపర పరమేశ్వరి.

రాజు:- భగవంతుడీ యువతులకు ఇంత ఉదారబుద్ధికూడా ప్రసాదించినంతే ఎంతబాగుండేది? నావంటి విరహజీవుల ఉసురంతా ఆ బ్రహ్మకే తగిలేను. నేనేమిచేయను? నా గుండె దడదడ కొట్టుకొంటోంది. నా దేహం చెమటతో నానిపోతుంది. నా శక్తి చలించిపోయింది. నోటమాటపోతుంది (క్షీణస్వరంతో) వాసవీ, వాసవీ, ఎంత పిచ్చిదానవు? ఎంత అమాయకురాలవు? ఆ కిరాతకుడు నీ తండ్రి నీకు పెండ్లిచేయడు. నాపై నీవు చూపే ప్రేమంతా నాకుతెలుసు. (బిగ్గరగా) నామాటలో నీమాట కలిపి, నా హృదయంతో నీ హృదయం ఏకంచేసి నా మోముతో నీమోము చేర్చి (విదూషకునితో) మిత్రమా అక్కడ సముద్రంలో నీవు మా ఇద్దరను ఇనుపబంధాలతో బిగించి వేద్దూ? నాలో తాను, తనలో నేనూ లయమైపోతాం కలిసుకుపోతాం. ఆఁ ఏమిటి? (స్త్రీకంఠంతో) "ఇదిగో దొండ పండులాంటి పెదవులు ఆస్వాదించమంటున్నావా? రా. నా ప్రియుడా! ఆలింగనం స్వీకరించమంటున్నావా? ఆఁ ఆఁ అయ్యో ఇదేమిటి? నీనొసటిని ఆ చంద్రవంకేమిటి? అయ్యో! ఆ పుర్రెలహారం ఎందుకు? అబ్బో ఆ నోట రక్తం, ఒళ్లంతా రక్తం, పెద్ద నాలుక సాచింది. చేతిలో మనిషి తలకాయ. అయ్యో! నీ సాత్వికాలంకారం అంతా ఏమయింది? ఆ కత్తి ఏమిటి? నన్ను నరికేస్తావా?

విదూ;- రాజా! రాజా! (గట్టిగా) రాజా! రాజా! (రాజు తేరి పారచూస్తాడు) ఒళ్లు తెలుస్తోందా! నీ కన్యారిప్రాశకం వచ్చిందిలే. శాంతించు శాంతించు.

రాజు;- నేనిప్పుడెక్కడున్నాను, నా వాసవి ఎక్కడ?

విదూ;- నీ తలకాయలో.

రాజు;- నేను వాసవిని తలుచుకుంటూ ఉంటే ఏదో పెద్ద దయ్యం నా కంటికి కనబడటం మొదలుపెట్టిందోయి. మాంత్రికునితో తగిన చికిత్స పొందాలిసుమా!

విదూ;- మాంత్రికులు మన పట్టణంలో చాలామంది ఉన్నారులే. మాంత్రికులది మంత్రశక్తి, ఆమెదో దైవశక్తి అంటే దైవశక్తికీ మానవశక్తికీ యుద్ధమన్నమాట. ఈ ఘోర సంగ్రామంలో తుదివిజయం దైవానికి తప్పదు. నీవెన్ని వేలాది మంత్రాలు వేయించుకున్నా ఇప్పుడు నీవు చూచింది తథ్యం కాకతప్పదు, కానీ రేపే మాంత్రికుని రావిస్తాను.

రాజు;- అంతేకాదు మిత్రమా, నీవు నా పరితాపం చూస్తూనే ఉన్నావుగా! ఆమెలో దైవశక్తి ఉన్నమాట వాస్తవమే కావచ్చు. అయితే ఆ దైవశక్తే నన్ను కూడా ఈ విధంగా వశంచేసికుని ఇష్టానుసారం త్రిప్పుతుంటోంది, దైవాజ్ఞలేనిదే గడ్డిపోచైనా కదలదుగదా! ఆ దైవం నాకీబుద్ధి ఎందుకు పుట్టించాడో అం. దుకే నేనూ కృతప్రయత్నుణ్ణి అవుతాను. రేపుదయం మాంత్రికుని రావించి ఆ దైవశక్తిని అరికట్టే మంత్రశక్తి ప్రభావంతో ఆమెను నాకు చేకూర్చగలుగుతానేమో చూస్తా. జగత్తు దైవానిది, దైవం మాంత్రికునిది. ఆ దైవం ఎలా తప్పించుకుంటుందో చూద్దాం. పెండ్లికాని కన్యను పెండ్లిచేసుకొవ

టంలో తప్పేమున్నది.! వాసవియే నా సర్వస్వం. నా ఇహలోకం పరలోకంకూడాను.

విదూ:- కామం కట్టుతప్పింది. పిచ్చిఎక్కింది. కర్మానుభవం తప్పదు మరి.

రాజు:- ఇక వేటకు పోదాంపద.

విదూ:- పద. ఆడజంతువుల్ని వేటాడుదువుగాని. (ఇద్దరూపోతారు)

(తెర పడుతుంది.)

ఐదవ రంగం సమాప్తం.



# వాసవీ కన్యక

## ఆరవ రంగం

(ప్రవేశం మాంత్రికుడు శిష్యునితో)

శిష్యుః- మీరు మహాత్మాటికి నిశ్చయించుకున్నారా గురువా? ఆమెకు దైవబలముంది. ధర్మబలం ఉంది. మీకో మంత్రబలముంది. మానవబలముంది. మానవ బలం గెలుస్తుందా? దైవబలం గెలుస్తుందా? ఈ విషయం కాలమే నిర్ణయిస్తుంది.

మాంత్రి;- కాలం ఏమినిర్ణయిస్తుందిరా? కాలం దైవం రెండూ మంత్రానికి లొంగవలసిందే. ఈ సృష్టి అంతా దైవాధీనం అయితే దైవం మంత్రాధీనంరా। దైవాన్ని వశంచేసికోటానికి మానవులంతా అఖండకృషి చేసారా! వాసవిలోఉండే దైవబలాన్ని వశంచేసుకుంటే వాసవి ఏంచేస్తుందిరా! అదికూడా ఓ మనిషేరా. మంత్రప్రభావంతో సృష్టికి ప్రతిసృష్టి చేస్తానురా. మంత్రప్రభావంతో ఆదిశంకరుణ్ణి కాళ్ళమీదవేసికోవటం త్రుటికాలంలో జరిగిపోతుందిరా. నా ప్రయత్నంఅంతా చూచి శంకరుడే గజగజ వణకిపోతున్నాడు. తెలిసిందామరి. దైవబలంఉంటే పరాన సౌఖ్యంఉంది. మంత్రబలంఉంటే ఇక్కడనే స్వశరీరంతో స్వర్గసుఖం అనుభవించవచ్చురా. కోరినధనం, కోరినగృహం, కోరినసౌఖ్యం అంతా ఇక్కడనే ఉందిరా.

శిష్యు;- అయితే గురువా! వాసవిలోఉండే దైవత్వాన్ని లాగివేస్తే ఆమె రాజుగారికి వశమవుతుందన్నమాటేనా?

మాంత్రి;- రాజెవడురా! వాసవి ఈ మహామాంత్రికుని సొంతసొత్తురా ఉన్న దైవబలంకాస్త మంత్రబలంతో లాగివేస్తే అది కుక్కలాగ వెంటపడిరాదే. (చేతితో విసరి) ఓమ్ ఫట్ స్వాహా అదిగో చూడు నాగుబాము.

# వాసవీ కన్యక

## ఏడవ రంగము

(ప్రదేశం: కుసుమశ్రేష్ఠి విచారంతో పచారులు చేస్తూ ఉంటాడు)

కుసుమ:- వాసవికి పద్దెనిమిదేండ్లు నిండిపోయినాయి. ఏమిచెయ్యాలో తెలియదు. ముందుచూస్తే నుయ్యి, వెనుక గొయ్యి అన్నట్లుంది వ్యవహారం. అసలు వాసవి పెండ్లియే వద్దంటుంది. వాసవిపై రాజుకు ఎంత ప్రేమో, వాసవికి నగరేశ్వరునిమీద అంత భక్తి. ఒకవేళ వాసవి పెండ్లికి యిష్టపడినా ఆమెకు తగిన వరుడెక్కడ? రూపమున్నవానికి విద్య ఉండదు. విద్య ఉన్నవానికి రూపము-వయసు. రెండూ ఉన్నవానికి తిండిఉండదు అన్నీ ఉన్నవానిని తెచ్చినా వాసవి ఒప్పుకున్నప్పటి మాటగా! ఎప్పుడూ నగరేశ్వర ధ్యానములో కూర్చుంటుంది. (నిట్టూర్పు) ఇది చాలా చిత్రంగానే ఉందే! (ఆలోచించి)

ఉ॥ అన్నము నీరమున్ గొనదు నారతమున్ నగరేశు పాదముల్
సన్నుతిసేయుచుండును, దలంపదు స్త్రీయు శక్తి సౌఖ్యమేన్
గన్న కుమార్తె యిట్లగుట నాంగగ శేశ్వర యేమి సేయుదున్
బున్నములెల్ల బండె యిట పుత్రిక కల్గె నటంచు నెంచితిన్।

ఏమీ తెలియటంలేదు. అయితే ఒక సంగతి. వాసవి మాతృగర్భం చేరుకున్నది మొదలు పరమేశ్వరీ అంశతో పుట్టుతున్నదని అనేకస్వప్నాలు వచ్చేవి. ఇంకా అలాంటివి వస్తూనే ఉన్నాయి. అయితే ఎక్కడైనా స్వప్నాలు సత్యాలవుతాయా ఇది ఎవడైనావింటే నన్ను ఒక వెర్రివాడని భావించక మానడా? స్వప్నాలకూ ఆమె ప్రవర్తనకూ సంబంధం కనబడుతుంది. పరమేశ్వరియే వాసవియై పుట్టటంచేత పూర్వ సంబంధ

స్త్రీగా తల్లి ఈమె వివాహమే వర్జించిందేమో. స్వప్నాలనుబట్టి ఈమె చేష్టలనుబట్టీ ఈమె పరమేశ్వరియే అనేవిషయం స్పష్టం. అయినా ఇవాళ కొన్ని ప్రశ్నలు వేస్తాను. నా సందేహం యేమాటకైనా సత్యం చెప్పుతుంటాను. నిన్న చూచిన "కల" చెప్పగా విని పకపకన నవ్వింది. "నాన్నగారూ! నేను పరమేశ్వరినా? అది యెలాగు?" అంటూ నవ్వింది కాదూ.

వాసవి;- (ప్రవేశించి) నాన్నగారూ! మీరేమిటి విచారంగా ఉన్నట్లున్నారు?

కుసు;- (తల సవరిస్తూ) అమ్మా! ఇవి దుఃఖాశ్రువులు కావు, ఆనందాశ్రువులు తల్లీ! మానవులకు దుఃఖంలో కలిగినట్లే, అత్యధిక ఆనంద సమయములోకూడా అశ్రుబిందువులు ప్రవహిస్తాయి.

వాసవి;- నాన్నగారూ! ఈనాడాకస్మికంగా యింతటి మహదానందానికి కారణం?

కుసు;- వెనుకటి కారణాలన్నీ ఒక్కపెట్టుగా జ్ఞాపకానికి రావటం, వెంటనే నీవుకూడా సమయానికి చేరుకోవటం యిదంతా ఆకస్మికానందానికి కారణం కాదంటావా?

వాసవి;.. మీకి పిచ్చి మాదిరి వేసుంది నాన్నగారూ! స్వప్నాలెక్కడైనా సత్యాలు అవుతాయా?

కుసు;- పిచ్చితల్లీ!

వాసవి;, సరే! గతరాత్రి స్వప్నం చెప్పండి. వినటానికి కుతూహలంగా ఉంది. (మందహాసం)

కుసు;- పదునారింటి సంవత్సరాలనుండి నీవు నా స్వప్న ప్రపంచంలో యెన్నో సంగతులు చెప్పావమ్మా. గతరాత్రి స్వప్నంలో నీవు స్వస్వరూపంతోనే కనుపించావు.

వాసవి;- తరువాత.

కుసు;- తరువాతనేముంది? నేనలా చూస్తూఉండగానే నువ్వు శక్తి లాగ మారిపోయినావు "నీవు నన్ను సాధారణ స్త్రీగా తలంచకు నేను పరమేశ్వరిని. ఏ పూర్వజన్మ పుణ్యఫలమంచేత నీకు నేను కూతురుగా జన్మించాను" అని అన్నావు తల్లీ! ఇప్పుడు అడిగితే ఏమీ తెలియదంటావులే ఎలా చెప్పి, (భాస్కరాచార్యుడు ప్రవేశం)

కుసు;- భాస్కరాచార్యులువారికి వందనసహస్రాలు.

భాస్క;- (దీవించి) విజయోస్తు (ఆసీనులై) అమ్మాయి! వాసవీ! మొన్ననీవు విశ్వమానవ సౌభ్రాతృత్వం, విశ్వప్రేమ అనే విషయాలపై చేసిన ప్రసంగం యావద్భారతవర్షాన్ని ఆకర్షించింది, నిజంగా నీవు చెప్పినట్లే ఒకే ఆకాశం క్రింద ఉండే వాళ్ళకూ, ఒకేభూమిపై నివశించేవాళ్ళకూ భిన్నరక్తం ఎక్కడ నుండి ఎలావచ్చిందో. ఏమానవుని రక్తంలోనైనా ఆ వంచ మహాశక్తులే గాక భిన్నవస్తువుంటుందా? ఒకేదేహం. ఒకేశక్తి ఒకేపరంజ్యోతి. భేదంఎక్కడ?

వాసవి;- భేదంఎక్కడ? ఆ అజ్ఞానంలోనే.

భాస్క;- అమ్మాయి! అజ్ఞానంఅంటే ఏమిటో చెప్పగలవా?

వాసవి;- క్షణభంగురమైన దేహాన్ని ఎక్కడో ఎండిన ఆకులాగా జీర్ణించి రాలిపోయే శరీరాన్ని తానని నమ్మటం అట్టి దేహం అశాశ్వతమని తెలిసియు నిత్యమూ తన కట్టెదుట జారి పోయే దేహధారుల్ని శుద్ధబుద్ధితో పరికించుచూ తనకుకూడ ఇట్టి దినం ఒకటున్నదని గ్రహింపనేరక నిత్యజీవితంలో పర హింసలపాటిస్తూ పరసుఖాన్ని పాడుచేసి పుత్రేషణ, దారేషణ, ధనేషణలకులొంగి వరుసగా తరలివచ్చే దుఃఖపరంపరలకు గాబరాపడి తన్నివారణ చేయజాలక తహతహలాడి కలతపడి

[illegible] జ్ఞానకల్పియు శునకమార్జాల సంతతి విధంగా తన్నుకుచావటమే అజ్ఞానమని నా యభిప్రాయం.

భాస్క:- ప్రభూ! ఇంకమీకు సందేహమక్కరలేదు. మీ కుమారిత ఆ జగన్మాతయనటానికి సంశయంలేదు. దైవజ్ఞుల జ్యోతిష్యం, నీ స్వప్నవృత్తాంతం, ఈమె ఉత్తమజ్ఞానం, నాయనుభవం ఇవన్నీ చెప్పకేచెప్పుతున్నాయి. పృథ్విపై ధర్మసంస్థాపన చేయటానికి ఆమె ఇలా అవతరించింది. నీవు వాసవికోసం వేరు వరుణ్ణి అన్వేషింపనక్కరలేదు. ఆమె ఆ జన్మ బ్రహ్మచారిణిగానే ఉంటుంది. జగన్మాతకు వివాహమేమిటి?

గీ॥ మూడుమూర్తులకును దాన । మూలమగుచు
వెలసినత్రిల్లి జగదంబ । ఇలజనించె
వాసవీకన్యకా స్వరూ । పంబునంది
అట్టి పరదేవికి వివా । హంబులేల?

(వాసవి చిరునవ్వు నవ్వుతుంది) ఇకనాకు సంధ్యావందన వేళ అయింది. నేను పోయివస్తాను.

కుసు:- (చిత్రం) (భాస్కరాచార్యుడు పోతాడు)

(తెర పడుతుంది.)

ఏడవ రంగం సమాప్తం.



# వాసవీ కన్యక

## ఎనిమిదవ రంగం

(ఇద్దరు రాజభటులు ప్రవేశిస్తారు)

1వ భ:- పెద్దాళ్లు పెద్దాళ్లనుకోటమేగాని ఆళ్ళకుండే నీచబుద్దులు ఇన్నీ అన్నీ కాదురా. రాజుగారికిదేం పోయేకాలమంట. ఆ పెళ్లికాని పిల్లని ఎత్తుకురమ్మంటాడు. అసలీపెద్దాళ్ళకి ఎక్కడ చూసినా ఆడోళ్ళ గొడవేనహె! వూరంతా పెద్దమనిసి మన కొంపల్లో తీర్పుచెప్పటానికి బుఱ్ఱలేని దొరలుకామా! మనతో మాటాడుతుంటారు మధ్యమధ్య ఇంటిదానొంక చూస్తుంటారు ఆళ్లుచూసేది మనం చూట్టంలేదనుకుంటారు. బుర్రుంటేగా ఆళ్ళకి?

2వ భ:- ఒరే పెద్దదొరలకే ఈ గొడవలున్నాయిరా. దరిద్రులు కొంపలు తీయటం పట్నాలకుచేరి తగలెయ్యటం, మనకు బుర్ర లేదని ఆళ్ళనుకుంటారు. మనకెంత తలతివ్వుందో ఆళ్ళకు బుర్రుంటేగా!

1వ భ:- మనరాజు కన్యకను ఎత్తుకుపోవటానికి చూస్తున్నాడని ఊరంతా గప్పుమంటిరా బాబూ. రాజుకేం మేఘాల్లో తిరుగుతాడు. ఈ అప్రతిష్టకు తలకాయెత్తుకుతిరిగేది ఎలాగురా బాబూ, నీముండనాకరీతగలెయ్య. గుడ్డిగవ్వకు కొరగానివాళ్ళకు చెప్పులు మొయ్యలేక చస్తున్నాం. వాసవీ అమ్మవారినే రాజు ఎత్తుకుపోతే ఇంకా ఆతల్లి చెప్పుకునేదెవరికిరా? రాజే కాడీ అయిపోయాడు ఈ కాలంలో. సిగ్గు శరం ఉన్నమనిషైతే ఇలాటి తప్పుడుపనులు చేస్తాడా!

2వ భ;- నువ్వు చెప్తూ అంటావు? ప్రజలంతా తనన్ని దేవుడులాగ కొలుస్తున్నారని అనుకుంటాడు. ఈ గొప్పోళ్ళంతా అంతే. ఆళ్ళుచేసే తప్పుడు పనులన్నీ ప్రజలు తెలుసుకోలేదని, ఆళ్ళకు అసలు బుద్ధిలేదని, ఆళ్ళే తెలివిగల మొనగాళ్ళని. ఈళ్ళంతా అమాయకులని గొఱ్ఱెలని, మళ్ళెవొళ్ళొచ్చుని, ఏంచేసినా అనుకుంటూంటారు. పోసి ఈ సోకరకైనా బుద్ధిఉందా? ఈళ్ళంతా ఎదవ సోకుకోసం ఆళ్ళమాటలే అంటారు.

1వ భ:- అంటావా ఎందుకు మనం అదేం అడిమాట?

2వ భ;- తప్పుతుందా మరి?

1వ భ;- అదే మనలోవుండే బుద్ధితక్కువతనం. ఒకణ్ణి విమర్శించటానికి తయారు. ఇన్నికబుర్లు చెపుతూ మనం వాసవీ అమ్మవారిని ఎత్తుకొచ్చి ఆయనకు కట్టిపెట్టటానికి సిద్ధం. మనప్రజలకు బుద్ధివుంటే కాదంటారు? రాజుకు బుద్ధివుండటానికి?
మొన్న ఏయుద్ధంలోంచి పారిపోయివచ్చిన శూరుడు కోస్తున్నాడులే ఆడు రాత్నికి యుద్ధానికి ఎళ్ళాడంట, అఖండయుద్ధం చేసాడంట యుద్ధమంతా అయిపోయిన తరువాత ఇంటికొచ్చాడంట అమ్మయ్య తలబరువు తీరిపోయింది అనుకుంటూ తల తడుముకున్నాడంట ఆశ్చర్యం! అక్కడ తలకాయ లేదంట ఓహో! యుద్ధంలో ఎగిరిపోయిందేమోలే అనుకున్నాడంట

2వ భ;- అయితేఆడు తలకాయలేకుండానే యుద్ధం చేసివుంటాడేమో?

1వ భ;- ఉంటాడేమో ఏమిటి? తలకాయలేని యుద్ధమే చేసి ఉంటాడు అందుకేగా పారిపోయి కొంపలో నక్కటం. వాడు చెప్పింది కూడా కొంత నిజమే. తలకాయ ఉన్నవాడు యుద్ధానికి పోతాడా మరి?

2వ భ;- అలా అయితే ఈ భూమిమీద యుద్ధాలుచేసే వాళ్ళందరికీ తలకాయ లేదన్నమాటే?

1వ భ;- ముమ్మాటికీ

2వ భ;- అయితే మనసంగతి? మనంకూడా యుద్ధ భటులమేగా?

1వ భ;- అవును మనం జగడానికిపోతే మనకీ తలకాయలేనన్నమాటే. మనం పొట్టకూటికోసం తలకాయలు కోయమంటే కోస్తాం. మళ్ళీ జోడించమంటే జోడిస్తాం. మనదేంపోయింది. మనకకావాలి డబ్బులు ముట్టితేసరి. మనమేం యుద్ధానికి పున్నపోతులాగా కాలుదువ్వుతున్నామా తలకాయ లేకపోవటానికి? తలకాయ లేనివాళ్ళంతా కొట్లాడుతుంటే తలకాయున్నవాళ్ళు వినోదం చూస్తుంటారు.

2వ భ;- అయితే ఇప్పుడు మనమేం చెయ్యాలంటావు?

1వ భ;- మనం తప్పకుండా రాజుగారి ఆజ్ఞ శిరవేద్దాం.

పోదాంపద—(ఇద్దరూ పోతారు)

—o—

(తెర లేచును)

వాసవి;- (తోటలో పాడుతూ కూర్చుంటుంది. క్రమంగా మైమరపు)

(ఇద్దరు రాజభటులు ప్రవేశం)

1వ భ;- తపస్సుచేసే కాలంలో ఎత్తుకొస్తే మహాపరిమాణం సంభవిస్తుందని మన మహారాజుగారేగా చెప్పారు: అందుకే ఈ తల్లిని నిద్రనుండిలేపి ఎత్తుకపోవటం మంచిది.

2వ భ;- నీ తలకాయల్లో ఉంది తీర్మానం. నేను తేలుని చంపకూడదు నువ్వు చంపు అన్నట్లుంది. సమాధిలోంచి లేపితేమాత్రం పరిమాణంకాదూ! ఉండేదేమో ఉండనే ఉంటుంది. సరే కాని నీ ఇష్టప్రకారమే చేశాము. పొట్టకూటికి చేరిన నౌకర్లకి తలకాయ యుండదని అధికారులు తలుస్తారు.

1వ భ:- ఈగంట నువ్వు వాయించు. ఈ డబ్బా నేను కొట్టుతాను.

1వ భ:- కేవలం పొట్టకోసం ఇంతింత నీచకార్యాలు చేయాలసివస్తోంది.

2వ భ:- ఏదిపోతా ఎవడు ఎలాచేస్తే మనకెందుకు? నువ్వు ఇంద్రుడు చంద్రుడు అంటూ నాలుగు వెధవకబుర్లు చెప్పేసిను మనపని మనం చూసుకుపోకేసిను, కాకపోతే ఏమిటోయ్! ధర్మంలో మనకి పనేమిటి? అసలు ధర్మం ఎవడిలో ఉంది? ప్రతివాడికీ డబ్బేకావాలి. డబ్బుకోసం ఎంతగడ్డితిన్నా అదో ఘనకార్యం వీధిలోకి నువ్వు చినుకు వాకా వేసికెళ్ళితే నీ మొగం చూసే వాడెవడ్రా! ఎత్తుకొచ్చైనా తెల్లగంతలేసికో. నీకెంతమర్యాద ఉంటుందో చూసికో! అసలీ ప్రపంచానికి నీతినియమం ఉందంటావా? నువ్వు దొంగతనంచెయ్యి, కొంపలుతియ్యి, హత్యలు చెయ్యి, ఎలాగైనా నాలుగురాళ్ళు పోగెట్టడం కావాలి. అప్పుడు నువ్వు ఓ ప్రభువు. అప్పుడు నువ్వు ఏం చేసినా చలామణీ అవుతుంది. ఏం కాదంటావా? మనకి దగా కోరుతనం చేతకాకు- చెయ్యనూలేము. అటువంటి అప్పుడు అధికారులు ఏదిచెయ్యమన్నా చెయ్యాలి. చెప్పులు మొయ్యమంటే? మొయ్యాలి. తప్పేతుందామరి? కన్యల్ని ఎత్తుకు రమ్మంటె ఎత్తికెళ్ళాలి! ఏంచేస్తావుమరి! పిట్టచూచి పీట కళ్ళు చూచి కాటుకపెట్టటం చేతకానప్పుడు? ప్రజలకీ మన ప్రభువుకీ కావలసింది అవినీతేగా? అసలు మన విష్ణువర్ధనమహారాజు మహానుభావుడే ఆయనచుట్టూ చేరిన మూకంతా కక్కుర్తి బాపతు. అసలు మనప్రభువుకి ఈ పిచ్చబుద్ధులన్నీ నేర్పింది ఈ పెద్దమనుష్యులే!

2వ భ:- అయితే ఇప్పుడు మనం ఏంచెయ్యాలంటావు?

1వ భ:- మనం రాజాజ్ఞ నెరవేరుద్దాం.

2వ భ;- సరే నీ ఇష్టమేకానీ! నేనోవైపున గంటలు వాయిస్తాను.
నువ్వు రెండోవైపున (తగ్గ్యామాకి) ఉదకార్పి హోమించు.

(ఇద్దరు అలాచేస్తారు. వాసవి మేలుకొంటుంది. వెంటనే భటులు పట్టి తెచ్చి రథంలో కట్టివేస్తారు)

వాసవి;- శంకరా! హేపశుపతీ! (ప్రార్థన చేస్తుంది)

౩వ రంగం సమాప్తం.

# విశ్రాంతి.



# వాసవీ కన్యక

## తొమ్మిదవ రంగం

(వాసవి ఒంటరిగా ఉంటుంది.) స్థానం. రాజశిబిరం.

వాసవి:- నగరేశ్వరా! నిన్ను నమ్మి నీకై యాత్మసమర్పణ చేసికున్న నీచరణదాసికి ఇన్ని ఇక్కట్లా? చిన్ననాటినుంచి నీస్మరణతప్ప అన్యమెరుగని దీనురాలిని. నిన్నే భర్తగా గ్రహించి నరాధముల్ని కన్నెత్తియైన చూడని నిర్దోషిని (దుఃఖంతో) నాథా ఇంకెన్ని కష్టాలు తెచ్చిపెట్టినా వాసవి నిన్ను వదలి జీవిస్తుందా ఈదిక్కుమాలిన హృదయం నీవుగ్రహించలేక పోతున్నావా? (హఠాత్తున ఏడుస్తూ) ఈరాజు కఠినాత్ముడు. యెంత భయంకర శిక్షలు విధిస్తాడోగదా? అయ్యో! ఆచార్య! మీరుమాత్రం ఇక్కడికెలా రాగలుగుతారు? బ్రహ్మజ్ఞాన సంపన్నులు (బిగ్గరగా) మీశక్తిః శాపాగ్నిలో ఈనీచుణ్ణి దగ్ధంచేయలేక పోతున్నారు. (బిగ్గరగా ఏడుస్తూ) నాన్నా! నాన్నా! ఇకనిన్ను చూడలేనా? యెంత గారాబంగా పెంచుకున్నావు! నాదైవ భక్తిని యెంత మెచ్చుకున్నావు? యెందరికి చెప్పుకున్నావు? (యోచించి) ఇంత భక్తితో సేవించినా ఆ దేవుడు......ఏడి. (ఏడుస్తుంది) (రాజు ప్రవేశం)

రాజు:- దేవీ! ఇటుచూడు! ఈ నవయౌవనం, ఈసౌందర్యం, ఈబిగుతనం, ఇవన్నీ ఏదో ఒకనాడు యెండిన ఆకులాగా రాలిపోయే వన్నమాటే. ఏమిలాభం? ఇలా శుష్కోపవాసాలతో దేహం కృశింప చేయటం, నగరేశ్వరుడు, నగరేశ్వరుడంటూ నోరు కాయకాసేటట్టు మొరగటం, ఇదంతా యెందుకంటాను? సిరి రా మోకాలొడ్డినట్లుగా రాణ్మహేంద్రి పురపాలకుడంతవాడు

నీ శృంగార పూర్తికై పరితపిస్తూ తహతహ లాడిపోతుంటే ఎందుకీ మెట్టవేదాంతం? ఆ బిగి స్తనద్వయం పొంగు కొంటె తనంగా నన్ను యెలా వెక్కిరిస్తోందో. దొండపండులాంటి ఆ లేత పెదవులు నావంటి రసికులకోసం యెదురుచూస్తుంటే యెందుకలా బంధమంత్రాలు వాటితో పఠిస్తున్నావు? నీ హృదయం, నాహృదయం, ఏకమైనాకే మన్మథ రాజ్యంలో నూతన విప్లవం చెలరేగినట్లేకదా! మనం ఉభయులం ఏకమై నవయుగ నిర్మాణం చేద్దాము. (చేతులు సాచుతూ) నిన్ను బలాత్కరించి బంధించి నేను సుఖప్రాప్తిని అభిలషించను. ఏమంటావ్! నా రామచిలుక!

వాసవి:- కామాంధత్వంలో నీవు సర్వం మరచావు. మరణానికి సమీపంలో వున్నావు. బలిపశువు పచ్చగడ్డి కోరినట్లు త్వరలో మృత్యు ముఖంలో ప్రవేశింపబోయే నీవు కన్యలకోసం పరితపిస్తున్నావు. ఈ చెరసాలే కాదు నన్ను సముద్రంలోకి విసరినా, త్రాచు పాములతో కరపించినా, నా హృదయాన్ని పరమేశ్వరునినుండి మరలించటం నీతరమా? అశాశ్వత దేహసౌఖ్యం కోసం శాశ్వత బ్రహ్మానంద పదవిని నీవంటి మూర్ఖుడు విసర్జిస్తాడు. కామధేనువును విడచి మేకను పితికినట్లు, గంగ ఒడ్డున నుయ్యి త్రవ్వించే మందమతి విధంగా నీవంటి పామరులంతా హేయమైన, స్వర్గ విఘ్నకరమైన, స్త్రీ పాదధూళిని తలపై నుంచుకొని ఆ మృదుపాదాలను మైమరపుతో భజిస్తారు. నీవంటి స్వేచ్ఛా విహారికి ఎన్ని చెప్పినా జ్ఞానం కలగటం దుస్తరం. కోతికి నగలు పెట్టినా, గాడిదకు పన్నీరు పూసినా, మూర్ఖునికి జ్ఞానోపదేశం చేసినా ప్రయోజనం పూర్ణానుస్వారం.

రాజు:- రాణీ! యజ్ఞ యాగాది క్రతువులు చేసే వారంతా దేనికి? రంభా సంభోగం కోసమేగా? వారికి నీమాత్రం జ్ఞానం కూడా లేదంటావు. ఈ సృష్టిలో సంభోగ సౌఖ్యాన్ని అపేక్షింపని

ఏమిటి నాకీమార్పు? కామం తెలియక కన్నుతెరచావు అంతే కాదా? కామం తెలిస్తే కోతలుంటాయా రాణీ! అమర్మార్గమ ప్రేమ్న...... నీకు కమ్మని యౌవనం, తియ్యని సౌందర్యం. ఇవన్నీ ఇచ్చి వాసనలేని పుష్పంలాగా తయారు చేశాడు! ఏపాటి జ్ఞానం నాకు లేదంటావా? నాకూ సర్వం తెలుసు ఏం చేస్తాను? కామోపహతజీవుణ్ణి, దీనుణ్ణి, దరిద్రుణ్ణి “అన్యథాశరణం నాస్తిత్వమేవ శరణం మమ” (సూచించి) ఆఁ తెలిసింది. నీకు కామంలేకపోవటంకాదు. బెట్టు! బెట్టు చేస్తున్నావులే అబ్బ! ఆడది ఏంత స్వాభావికంగా నటిస్తుంది! తాను పరపురుషుని కోరికే లేనట్లు నటిస్తుంది. ఆఁ అవసరమైతే నిగ్రహిస్తుందికూడా. పురుషుడు పిచ్చివాడు. ఆఁ ఇది ఏమిటి? ఏమీ మాటమాటాడవు (రోషంతో) వాసవీ! ఇది నీ ప్రేమపరీక్ష కాకపోతే ఫలితానికి సిద్ధపడు.

వాసవి:- మానవుడు ఆత్మనాశనం చేసికోవటానికి శాశ్వత సౌఖ్యాన్ని మంటకలుపుకోవటానికి మన్మథోపాసనచేయాలి. నేను కామం వర్జించాను. ఎండమావుల్లాగ మానవుణ్ణి వశంచేసుకొని ఇష్టం వచ్చినట్లు తాండవం చేయించే కామం, మానవునికి శాశ్వత సుఖం ఇవ్వదని నా యాత్మవిశ్వాసం. దీనిని చలింపజేయటం హిమాలయం పెకలించటంవంటి పని. అప్పటికిని నాభావం నేను మార్చుకోను. నాజీవితం నగరేశ్వరునికి ఏనాడో అంకితమైపోయింది. నిర్మలమైన గంగాతరంగాల్లో ఊగులాడే రాజహంసి, పందుల పల్వలోదకంలో ప్రవేశిస్తుందా? నీవు మర్యాదగా నన్నువదలు. నాయాశీర్వాదం గ్రహించు.

రాజు:- ఒకవేళ నీ నగరేశ్వరుడు నీకు దర్శనమిచ్చినా వాడు కఠిన దరిద్రుడు, వల్లకాడులో వాసం, పుర్రెలహారం, ఒంటినిండా క్రూరపాములు (భయంతో) అబ్బ! నాథాయని ముద్దాడ

బోతే బుస్సుమని పడగవిప్పిన తాచు. ఛీ! ఈ దాంపత్యం కష్టమైనట్లే ఉంది.

వాసవి:- నగరేశ్వరుడు దరిద్రుడైనా సకలైశ్వర్యాలకు అతడే కర్త. తాను దారిద్ర్యమనుభవించినా, పరులకు ఐశ్వర్యం ప్రసాదించే మహాత్ముడు.

రాజు;- ఏడీ? ఆ నగరేశ్వరుడు నిన్ను రక్షిస్తాడంటావా? (క్రోధంతో) నీవిప్పటిదాకా విష్ణువర్ధనమహారాజు శృంగార తత్వాన్ని చవి చూచావు. ఇక వానిభయంకర క్రౌర్యతత్వాన్ని ఎదుర్కొనటానికి సిద్ధపడు.

వాసవి;- నన్ను నాతండ్రిదగ్గరకు చేర్చురాజా!

రాజు;- నన్ను ప్రేమించు నారాణీ!

వాసవి;- నిన్ను ప్రేమిస్తున్నానురాజా!

రాజు;- అయితే నారాణీ! నీవు సగర్వంగా నా యెడమ తొడపై కూర్చుండు చిలుకా!

వాసవి;- నా ప్రశ్నలకు ముందు సమాధానం చెప్పురాజా!

రాజు;- ఏమది? త్వరగా తెలుపుము వాసవీ!

వాసవి;- నీతల్లిని కన్నదెవరు?

రాజు:- ఆమెతల్లి.

వాసవి;- ఆతల్లిని కన్నది?

రాజు;- ఆపైతల్లి

వాసవి;- ఆ పైతల్లిని కన్నది?

రాజు;- ఆ పైతల్లి.

వాసవి;- ఇలా పోగాపోగా మొదటితల్లిని గన్న చివరి తల్లి ఏది?

రాజు:- పిచ్చిపిల్లా! ఆ జగన్మాత, ప్రకృతి, మొదటితల్లిని కన్నది కదూ నా చిలుకల కొలికీ?

వాసవి:- అయితే మనమంతా ఆతల్లి బిడ్డలమన్న మాటేనా?

రాజు:- అవును, ఆమె తల్లి. మనమంతా బిడ్డలమూనూ.

వాసవి:- అయితే యిప్పుడు చేసుకోవాడా ఆ తల్లి బిడ్డడేగా?

రాజు:- అవును,

వాసవి:- అయితే మనం యిద్దరం ఒకతల్లికే పుట్టామన్న మాటేగా?

రాజు:- ఒక్కతల్లికి పుట్టినా కాలక్రమంచేత భిన్నరక్తం మన జన్మలకు కారణమయింది,

వాసవి:- భిన్నరక్తానికి మూలతత్వం ఒక్కటా రెండా?

రాజు:- ఇక నా కర్థమైంది. నీవు నన్ను సోదరునిగా ప్రేమిస్తున్నానన్న మాట. (క్రోధంతో) నాకు రెండు మాటలలో చెప్పు? నీవు నన్ను వివాహమాడి సౌఖ్యమిస్తూ ప్రేమిస్తావా లేదా? ఈ మెట్టవేదాంతాలు నీకంటే నాకే ఎక్కువ తెలుసు.

వాసవి:- తెలిసే యిదంతా చేస్తున్నావా?

రాజు:- తెలిసినవాడు ధైర్యంగా చేస్తాడు, తెలియనివాడు భయంతో చేస్తాడు. ఫలితం రెంటికీ సమానమే. ఇంక నీ యింద్రజాల విద్యలు నాముందు పనిచేస్తాయా? నీవు రాజద్రోహం చేసిన పాపివి. భూమికి భర్తయైనవాడు, అందున్న స్త్రీలకుగూడా భర్తకాగలడుగదా! అందుకు భిన్నంగా వర్తించిన కులటవు. భూపతిని ప్రేమించక పిశాచపతిని ప్రేమించిన అపరాధంక్రింద యిప్పుడే కఠినశిక్షకు పాత్రురాలవుకాగలవు. (ప్రక్కకుచూచి) ఎవరురా! (సేవకులు ప్రవేశం)

(సేవకునితో) తలారులను పిలిపించి తక్షణమే యీ రాజద్రోహికి రెండుకన్నులు పెకలించమని నా యాజ్ఞగా మంత్రికిచెప్పు. మొత్తం అర్ధఘడియలో ఈపని పూర్తికావాలి. అంతవరకు నేనిక్కడనే ఉంటాను. (వాసవితో) నీ చర్మం ఒలిస్తే పాపముండా పిశాచీ! నన్నా మోసగించటం? నేను నిన్ను ప్రేమించానుగాని దూషించలేదే! ప్రేమించటం కూడా ఒక అపరాధమని నీ జగదీశ్వరుడు చెప్పాడా?

వాసవి:- (దీనత్వంతో) రాజా! నన్నంధురాలను చేస్తావా?

రాజు:- అంధత్వమేకాదు, చూడు. యిప్పుడే కొరడాలతో నీ చర్మం ఒలిపిస్తాను, (ఇద్దరు నౌకరులు ప్రవేశింతురు)

రాజు:- ఈ తుచ్ఛురాలిని కొరడాలతో చావమోది అనంతరం కాచిన యినుపసూదులు ఎఱ్ఱగాకాల్చి ఈమె రెండు కండ్లలో గ్రుచ్చి వేయండి.

నౌక:- చిత్తం ప్రభూ!

రాజు:- ఒక్కఘడియలో పనిపూర్తిచేసి ఆమెను నావద్దకు తీసుకురండి (రాజు వెళ్ళిపోతాడు)

1 వ నౌక:- (రెండవవాడితో) సూదులు కాలినాయంట్రా ఎంకయ్యా

2 వ నౌక - అవిజ్యోతుల్లాగ ఎప్పుడో ఎర్రపడ్డాయిసా.

1 వ నౌక:-అమ్మోర్నా! మా తప్పేముంది. ఆ పక్కగదిలోకెళ్ళి కూర్చో మాపని పూర్తిచేసుకుంటాము.

2 వ నౌక:- ఇందుకే రాజేలుతున్నాడా? ముండేలుతోందా అంటారు?

1 వ నౌక:- ముండేలుతోందనిచెప్పు వాళ్ళకి.

2 వ నౌక:- ఒరే అన్నయ్యా మనం కొంచెం నెమ్మదిగా కొట్టసూడ దంట్రా అమ్మోర్నిని.

1వ సైనికు:- ఏమిటి రాజా? అధికమాస తద్దినంలాగా ఆ దొరగా రిక్క-డికే వచ్చి కూర్చుంటుంటుంది. (వాసవి ముఖములో ప్రార్థనానంత రం తేజస్సునికి వెల్లుతుంది. రెండో వైపునుంచి రాజు ప్రవేశించి సింహాసనం మీద కూర్చుంటాడు)

(సైనికులు కొరడా ప్రహారాలు ఆరంభిస్తారు.)

వాసవి:- అబ్బ! (దెబ్బ) జగదీశ్వరా! నీరిలో ప్రవేశించు. (దెబ్బ) అబ్బ నాయనా! అయ్యో! ఈ బాధకు తట్టుకోలేను. (మళ్ళీ దెబ్బ) జగదీశ్వరా! పాశుపతీ! (బిగ్గరగా) పశుపతీ! త్వరగా తీసుకు పో! అయ్యో! ఏమి బాధ. నాయనలారా! బాబులారా! మీరైనా కనికరించండి. అయ్యో! (మళ్ళీ దెబ్బ) నీకు జాలి లేదా? పశుపతీ... ఎంత నిర్దయుడవు? భక్తురాలు కీడురాలు. (సైనికులతో) బాబూ మీ రాజువద్దకు నన్ను తీసుకపోండి. నేనీ బాధను సహించలేను ఆ తండ్రిని కరుణాభిక్ష కోరుకుంటాను అయ్యో నాదేహం నుండిపోతున్నది. అయ్యో నన్ను రక్షించేవారులేరా? (సైనికులు ఎత్తితెచ్చి రాజుముందు పడవేస్తారు.) (వాసవి స్పృహతప్పి ఉంటుంది)

రాజు:- పిల్లా నీ ఇంద్రజాల విద్యలన్నీ ఏమంటకలిశాయి? ఏడీ నగరేశ్వరుడూ! గిరీశ్వరుడూనూ? (వాసవి కన్నులు విప్పుతుంది, క్షీణస్వరం)

వాసవి:- రాజా! నీవు నన్ను ఎంత ద్వేషిస్తున్నావో అంతకు వేయిరెట్లు అధికంగా నిన్ను ప్రేమిస్తున్నాను. దేహాన్ని అంటిపెట్టుకున్న దోషంచేత జీవుడు బాధ సహించలేకపోతున్నాడు. నిన్ను నా తండ్రికంటే మించి ప్రేమిస్తున్నాను. నన్ను స్వేచ్ఛగా వదలు. ఎందుకు విప్లవం చేస్తావు? అస్థిరమైన దేహసౌఖ్యంకోసం?

రాజు:- (సైనికులతో) ఇంకా దయ్యమే పలుకుతోంది. వాసవి

మాటలు కావివి. తీసుకుపొండి. చిటపటలాడుతున్న మాటలతో చీవి గాయాలు కడిగివెయ్యండి. దానితో ఈ వాసవి హృదయ పిశాచం వదలిపోతుంది. శెభాస్ నాపిల్ల '

వాసవి;- (అతి ఉచ్ఛస్వరంతో ప్రార్థన చేస్తుంది. ఆమె దేహం వణికి పోతుంది. కన్నుల వెంట అశ్రుప్రవాహం ప్రవహించుచుంటుంది.) నా సౌందర్యం దగ్ధమయింది. అయ్యా నమ్మా! నా నాన్న కుసుమ గుప్తా! నీ కూతురు బాధలు నీకు తెలియవు గదా! అమ్మా! ఈ వాసవి ఇక్కడే ప్రాణం విడిస్తే నీవెంత బాధపడతావో గదా! బ్రహ్మదేవుడా! సృష్టిలో సౌందర్యం చేసినావు! అబ్బా నంతా ఇలా బాధలుపడి చావటానికేనా? నాకిక వేయిజన్మల కైనా కురూపిగానే జన్మించాలి. జన్మజన్మలకు సౌందర్యం వద్దు. మానవతులారా! మీరు మానవతులుగా జీవించదలిస్తే సౌందర్య వాంఛ వర్జించండి. తల్లులారా! నా సౌందర్యం నా ప్రళయానికి కారణమయింది. సీతామహాదేవి, దమయంతి మొదలైన మహాపతివ్రతలు సౌందర్యానికి బలి అయిపోయినారమ్మా! నాకు సౌందర్యం వద్దు, వద్దు. నా స్త్రీజాతికి సౌందర్యం వద్దు వద్దు వైశ్యజాతికి సౌందర్యం వద్దు

రాజు;- (సేవకులతో) ఈ నారీపిశాచాన్ని లోనికి ఈడ్చుకుపొండి. ఉగ్రశైలంలో దేహం కడిగి నా సన్నిధికి తెండి. ఊం (సైగ చేస్తాడు. భటులు ఉద్యబోతారు.)

వాసవి;- (సేవకులతో) నిలవండి జీవనపొట్టకోసం ఉచ్ఛనీచాలు వర్జించి హేయాతిహేయమైన పాపానికి ఒడికట్టుకొనే క్రూర వాడి నరకాధికారులు మీరు. నన్ను మీరు స్పృశించనక్కర లేదు. మీ రాజాజ్ఞ తిన్నగా పాలించండి. నాకు భయంలేదు. కరుణమాలి మానవతీ మానహరులైన ఈలాటి అధమరాజులుండి ఏమి? మండిపమి

శ్లో॥ సౌందర్యాంకిత విగ్రహ! నాటక వేసవు మోస వాక్యాలక్
వింతమయా సమాయుతుల; కింపి ప్రజాప్రభు పీతమెకి, యి
ప్పుడిది, సింహాసనాలతో! వంచనజేతువె! భారతీయ పు
ణ్యాంగన ... నా స్మృతి పోవుని స్వార్థభూతమా!

కొక్కమైన ప్రజాజీవితాలకు, స్వేచ్ఛా సౌఖ్యాలను స్వేచ్ఛా యత్తచిత్తంతో వర్తించే (వేలుమాపి) ఇలాంటి ఉన్మాద నృపక జాతి నశ్యనున్నదిగదా! అతిహీన జనస్వరూపమై, నింద్యాతి నింద్యమై, పాపభూయిష్ఠమై, క్షణభంగురమైన ఈ... అధమ దేహంకోసం నేను దుఃఖించను. నన్ను కత్తులతో పొడిచి హింసించినా, రంపములతో కోయించినా, ప్రళయాగ్నులలో భస్మీభూతమొనర్చినా, కొండలనుండి దొరలించినా. భయంకర సర్పాలతో కాటేయించినా, జగదీశ్వర చరణసాన్నిధ్యం నుండి నాచిత్తం చలింపజేసేవాడు పుట్టలేదు. పుట్టడు. నా నుండి భిన్నమైన దేహానికి మీరు కలిగించే బాధలు నన్ను చేరుకొనటం మాయాసాగరానికి సత్యమే కావచ్చును. కాని పండిత లోకం దాని యదార్థతత్వం వెల్లడిచేయక మానుతుందా? ఇదే! నేను మీ వెంట వస్తున్నాను. మీ ఇష్టానుసారం ఈ జడ దేహాన్ని బాధించండి. (సేవకులవెంట పోతుంది. రాజు నిర్విణ్ణుడౌతాడు.)

రాజు:- (అశ్రుకంఠంతో) ఇది ఏమిచిత్రం! దీనికథ విశ్లేషచరిత్రను జ్ఞప్తికి తెస్తున్నది. ఈమె దానవియా? మానవియా? (యోచించి) సరేకాని... మాతాం దానవీ, మానవీ గాక దేవతయే అయివుండిన మహిమంచినే. ఆమె దేవత్వం నానుండియే గదా జగద్విఖ్యాతం కాగలుగుతుంది. ఈమె చరిత్రతో బాటు నా చరిత్రకూడ నడుస్తూనే ఉంటుందిగదా, ఈనాడే కాదు. ఏ నాడైనా, ఏచరిత్రయందైనా, ఏ నాటకమందైనా నాసవి లేనిదే విష్ణువర్ధనుడు లేడు. అతడు లేనిదే నాసవి లేదు. చూస్తాను.

కన్నులు పీకివేసేకాలంలోనైనా ఆమెబుద్ధి చలింపకపోతుందా? ఏమైనా నాకేమిభయం? లోబడినదా, ఉపయోగమవుతుంది. లోబడదా, సత్యాన్ని వెలువరించినపుణ్యం నాకు లభించదా? (యోచించి) శెభాస్...ఆదర్శ భారతవీరనారి. భావియుగంలో నా పాత్రధరించినవాడుకూడా తరిస్తాడు. సత్యాన్ని కొని దాని ఉజ్జ్వల ప్రభావాన్ని అద్వితీయ నిరంకుశత్వాన్ని లోకానికి వెల్లడిచేస్తానుకదూ! (తెరలో ధ్వని హేపసుహట్!)

రాజు:- ఏమాశ్చర్యం! ఈసారి ఇంతటి తీవ్రబాధ, అత్యుగ్ర శైలపాత భయంకూడా వర్జించింది. ఆహా ఏమి గొప్పతనం! ఇట్టి ఆదర్శనారి భార్యగా లభించినవాని పుణ్యం చెప్పగలమా! సామదాన భేద దండోపాయాలు పూర్తిఅయినాయిగదా! ఇంక ఈమె లోబడుతుందా? మనుష్యుడనై పుట్టి కన్నులూడపెరకటం సామాన్య విషయమా! కామోపహత చిత్తుడ్ని దేనికైనా సిద్ధమేగదా! (నౌకరులు శవప్రాయమైన వాసవిని తెచ్చి పరుండబెట్టుతారు. వాసవి సమీపాన కూర్చుని రాజు యోచన చేస్తాడు) వాసవీ! (పిలుచును) (వాసవి మెల్లగా కన్నులు తెరచును) వాసవీ! నాకారణంగా ఎన్నిబాధలు పడుతున్నావు, (దుఃఖంతో) నిన్ను, నిరపరాధిని దొంగతనంగా పట్టితెచ్చి పడరానిహింసలు పెట్టాను. నిశ్చయంగా నీ సౌందర్యం నన్నొక నీచుడిగా తయారుచేసింది. మానవతీ మానభంగ దోషం నన్ను వదలుతుందా? ఆచంద్రార్కం అఖండకీర్తిని తెచ్చుకున్నావు. అత్యుజ్జ్వలమైన ఈ నీలాకాశంలో మహోత్తర నక్షత్ర జ్యోతివై శాశ్వతంగా నావంటి పాపాత్ముల పరికించుతూ ఉంటావు. నీ నగరేశ్వరత్వాన్ని నాలో నిల్పి నన్ను శివునిగా భావించి నీ గాఢాలింగనసౌఖ్యం నాకు కలుగజేస్తే ఇందులో తప్పువున్నదా? ఎంతపిచ్చిదానవు. ఎంత

అమాయక స్వాంతవు, నిన్ను చూచినకొలది జాలిపుట్టుకు వస్తున్నది. పతియే దైవమనిగదా భారతనారికి విధింపబడిన ధర్మం. నన్ను పతిగా గ్రహించి ఆ నగరేశ్వరత్వం నాయందే నిలిపిన ఏమి దోషం? (గద్గదస్వరం) నా మనోరథమీడేర్చవా? నన్ను తరింపజేయవా? నీకై సర్వస్వం ధారబోయటానికి, తుదకు ప్రాణాలుకూడా బలిపెట్టటానికి సిద్ధపడి ఉన్నాను. నన్ననాయం చేస్తావా?

వాసవి:- రాజా నీవుచెప్పినవన్నీ ఏనాడో రావణాదులు చెప్పి వదిలారు. ఇంక నేచెప్పేదిలేదు.

రాజు:- ఆఁ నిన్ను నేనింత ప్రేమిస్తుంటే నీవు నన్ను రావణాదులతో పోల్చుతావా? నిజేమో దేవతవనుకున్నాను. ఇక కాసుకో! ఈ విష్ణువర్ధనుని రోషకషాయిత నేత్రజ్యోతిలో నీ నగరేశ్వరుడూ నగరేశ్వరుడూ భస్మీభూతం కావలసిందే! ఓరీ (సేవకుడు ప్రవేశించి చిత్తం అంటాడు)

రాజు:- (సైగచేసి) ఊఁ ఇంకా ఆలస్యం ఎందుకు? (నౌకరు సూదులు తెస్తాడు).

వాసవి:- నేను సర్వ సంసిద్ధురాలను. రాజా! మంచిపని చేస్తున్నావు. ఈ నేత్రాలు అతి త్వరితంగా పెరికివేయించు. నీ వంటి పాపులను చూడక నిర్మల ధ్యానంతో నా నగరేశ్వరునే చూడ గలుగుతాను. మంచిది కానివ్వండి. (పద్మాసనంలో కూర్చుని ప్రార్థన. అనంతరం కన్నులు పెద్దవిచేసి) ఇంక మీ ధర్మం నిర్వర్తించండి.

రాజు:- ఊఁ...(సైగ చేస్తాడు. నౌకరులు సూదులు గ్రుచ్చబోతారు.)

(నౌకరు ప్రవేశం)

నౌక;- అయ్యా! ఓ పాములవాడు తాను వచ్చేదాకా ఈ పని ఆపి తన్ను లోనికి ప్రవేశించటానికి అనుమతి కోరుతున్నాడు.

రాజు;- (నౌకరుతో) ఆపవోయ్! (నౌకరు ఆగుతాడు) ఇది ఏదో చిత్రం పాములవాడికీ వృత్తాంతం ఎలా తెలియుటం! ఇదంతా ఒక గొప్ప నాటకంలాగ ఉందే! (నౌకరుతో) ఎవడా పాములవాడు? వానిని త్వరగా ప్రవేశపెట్టు. (నౌకరు పోతాడు. రాజు వాని విని చూస్తూవుంటాడు. విజయుడు పాములవాని వేషంలో ప్రవేశం.)

పాము;- అయ్యోర్లు దండాలండి!

రాజు;- నీ దేవ్రారోయ్!

పాముల;- నీడపట్టున కూర్చున్న నౌకరలకు ఒకూతే గతిగాని; అను కున్నసే వానివేనండీ అన్ని ఊళ్లూ.

రాజు;- అయితే ఇక్కడి వృత్తాంతం నీ కెలా తెలిసింది?

పాముల;- నా పెళ్లాం చెప్పిందండీ దొరగారూ!

రాజు;- పెండ్లామా! ఆమె కెలా తెలియుటం!

పాముల;- ఈ అమ్మోరే దానికి కల్లోకవపడి చెప్పిందంటుంది బాబూ!

రాజు;- అమ్మవారు చెప్పిందా? చెప్పు ఏం చెప్పిందో?

పాముల;- ఏముంది బాబూ! చెప్పటానికి? మీ రామును చంపటానికి ప్రయత్నం చేత్తున్నారనీ, అమ్మోరుకూడా అందుకు సిద్ధంగానే ఉందని, కుసుమగుప్త మారాజుగారు అమ్మోరిని మీకిచ్చి పెళ్ళి చేత్తారని ఏమేమో చెప్పిందంటుంది బాబు. తెల్లారి అది అంతా మరిచే పోయిందంట మరి.

రాజు;.. అయితే నీ పెళ్ళాంకూడా గట్టిదన్న మాటే?

పాముల;- గట్టిదో ఓటిదో; దాన్నికూడా పట్టి చూడండి బాబూ.

రాజు:- ఏమిటి బహు చమత్కారంగా మాటాడుతున్నావు ?

పాములు:- నా దగ్గర ఉన్నదే అదండి బాబు,

రాజు:- ఏది ?

పాములు:- ఉన్నదాన్ని లేదంటం, లేనిదాన్ని ఉందంటం. ఇంకేముంది బాబు.

రాజు:- వేదాంతిలాగ ఉన్నావే ?

పాములు:- ఉండేది అదండి.

రాజు:- ఏదంటే అదే ఉందంటావ్

పాము:- అదే ఉందండి.

రాజు:- ఏమి ఉంది?

పాము:- ఏది కావాలంటే అదే ఉంది,

రాజు:- అయితే ఈపిల్లను నావశం చేసే శక్తి ఉందా?

పాము:- ఆశక్తి ఈ బుట్టలో ఉందండి.

రాజు:- ఏమిటది? తాచుపామా?

పాము:- ఇదిగిదిగో చూడండి బాబు. (పామునుతీసి) అమ్మోరు! చూడండి ఈపాము తమాషా!

రాజు:- అరే! ఈపాము ఏంచేస్తుంది? చిత్రంగా ఉందే!

వాసవి:- నారాజా! వచ్చావా! ఎన్నాళ్ళకెన్నాళ్ళకు దర్శనమిచ్చావు! బిడ్డా! నీ అమ్మదగ్గరకొచ్చావా! కష్టాల్లో వుండే అమ్మను కాపాడుకోటానికి వచ్చావా! (నాగస్వరం సంగీతంతో పాడుతుంది. నాట్యం, మైమరపు, భూపతనం)

రాజు:- (దగ్గరకువెళ్ళి) వాసవీ! వాసవీ!

వాసవి:- (కండ్లుతెరచి) ఎవరు? నానాగేశ్వరుడా? నాగేశ్వరా! దయ

పుట్టిందా దానిమీద అబ్బ! ఎన్ని క్రిములు పెట్టావు.

రాజు:- అవును నేను నగరేశ్వరుడనే నయపుట్టి వచ్చాను,

పాము:- పెద్దలువారు చూశారుగా బాబు! ఇదంతా పాము సత్తైనే నండి.

రాజు:- అవును ముమ్మాటికి నీవు సత్యం చెప్పుతున్నావు. నీవు పాముల వాడివికాదు. సాక్షాత్తు విష్ణుమూర్తివే నెంచావు. మహానుభావా! నీవీసింహాసన మలంకరించు. నేను నీపాదదాసుణ్ణి. (బలవంతంగా ఎత్తి సింహాసనంపై కూర్చుండబెట్టుతాడు. కన్నులుమూసుకొని) అబ్బ! వాసవీ! నీ గాఢాలింగన సౌఖ్యం ఎప్పటికోగదా? (అని కౌగలించబోతాడు. పాములవాని సైగ బొంది భాస్కరాచార్యుడు మధ్యకు వస్తాడు. రాజు తెలియక అతనిని గట్టిగా కౌగలించుకొంటాడు)

భాస్క:- రాజా పొరబడుతున్నావు. నేను వాసవినికాను. భాస్కరాచార్యుణ్ణి. మగాణ్ణి. బ్రాహ్మణుణ్ణి. (రాజు సిగ్గుపడతాడు)

పాము:- (భాస్కరునిచూచి) పెద్దవులు బాపనోరు దండాలు. (సైగ చేసి పోతాడు)

భాస్క:- రాజా! ఎందుకీ తొందర! తినబోతూ రుచి అడుగుటా వేమిటి?

రాజు:- (ఆశ్చర్యంతో) మీకీ సైగలు ఎలా రాగలిగాయి?

భాస్క:- ఇప్పుడు మా నిర్ణయం వింటే నీవుమాత్రం నన్ను వదులుతావా? వివాహ ముహూర్తం దగ్గరపెట్టుకొని ఎందుకు ఇలా తొందరపడతావు?

రాజు:- అది నాకేమి తెలుసునండీ? ఏమి! ముహూర్తం నిర్ణయం చేయించారా! (వాసవితో) ఓరా ఎంతజాణవేపిల్లా! నాదగ్గర బెట్టుచేస్తావా? నేనప్పుడే అనుకున్నాను. నీవు నా ప్రేమ

వరిస్తే చేసే దరిదాపులవని ఆహా! ఏమి బ్రహ్మసృష్టి వైచిత్ర్యం రూపం, గానాపరం, సౌందర్యం, గాంభీర్యం, వైరాగ్యం, వైనమ్యం, చాతుర్యం, సంగీతం, లావణ్యం, ఐశ్వర్యం, భక్తి శక్తి, ముక్తి, సర్వం నీలో వున్నాయి. ఇట్టికన్య వెనుక పుట్ట లేదు. ముందు పుట్టబోదు.

భాస్క:- సీ: శ్రీయును కులమును, రూపము
ప్రాయము, శుభ లక్షణంబు బాంధవ విద్యా।
శ్రేయము గలవరు కన్యాయుతుగా
చేయ వలయు నధిక ప్రీతిన్ ॥

అని పెద్దలన్నారు. గనుక ఒకటి రెండు గుణాలు ఇందులో లేకపోయినా ఇన్ని సద్గుణాలు గలిగిన వరుడు లభించటం కష్టమే గనుక మీకే యిచ్చి వాసవి వివాహం చేయటానికి పెద్దలచే ముహూర్తం నిర్ణయింపబడినది. గాన తామెల్లరు బంధుమిత్ర పరివార సహితంబుగా విచ్చేసి మాచేయు చందన తాంబూలాది సత్కృతుల నంది మహానందింపజేయ వేడు చున్నాను. ఇది కుసుమగుప్తుని సందేశం. ఇంక వాసవిని తీసుకువెళ్లి ఆమెకు పెండ్లి అలంకారాలు చేయించటం యుక్తం.

రాజు:- (సంతోషంతో) ముహూర్త మెప్పుడు నిర్ణయించారు?

భాస్క:- కార్తిక బహుళ చతుర్దశి బుధవారం వృశ్చికం గడిచి ధనస్సు ప్రవేశిస్తుండే అప్పుడని చెప్పమన్నారు. గృహపురోహితుణ్ణి గనుక నా విధి పూర్తిచేశాను. మీరు పరీక్షువులు. అతడు సామంతుడు. ఎంతకాల మీ వైరం?

రాజు:- (అధికానందంతో) బాగు బాగు. (చేయి కలిపి) మీరు మా శాస్త్ర బంధువులు ఈ శుభ వివాహమంతా మీ కోషులమీదు గానే జరిపిస్తారా?

భాస్క:- ఆ భగవన్నిర్ణయం అలాగే ఉంది.

రాజు:- వాసవీ ! పుట్టినింటికి పోయి వస్తావా! ఈ వియోగ జలధిలో నేను మునిగి చావ వలసిందేనా ?

భాస్క:- ఆఁ ముమ్మాటికి, తథాస్తు. విరహానికి మించిన తీపి ఉందా?

రాజు:- అ హా హా హా! (వెర్రి నవ్వు) సరే పోయిరండి. (వాసవి వీపు తట్టబోతాడు – ఆమె తప్పించుకు పోతుంది).

( అంతా వెళ్ళిపోతారు. )

(తెరవాలుతుంది)

తొమ్మిదవ రంగం సమాప్తం.



# వాసవీ కన్యక

## పదవ రంగం

### వైశ్య సభ.

(భాస్కరాచార్యులు, వాసవి, కుసుమశ్రేష్ఠి, కుసుమాంబ మొదలైన పెద్దలు ఆసీనులై యుంటారు. సభలో ఇంకా అనేక వైశ్య ప్రముఖులుంటారు.)

కుసుమ:- (లేచి) వైశ్య సోదరులంతా ఈ సభకు రావింపబడటానికి కారణం ముందే ఊహించి ఉంటారనుకుంటాను. ఈజాతిని ఈనాడు ఎదుర్కొన్న సమస్య ఈసభలోనే పరిష్కృతం కావలసి ఉంటుంది. పవిత్ర భారతవర్షంలో ఈనాడు ఒక్కజాతికి జాతి బలికాబోతున్న విపత్కర పరిస్థితుల్లో చిక్కుకుపోయింది. ఆ జాతిని ఆ స్థితినుంచి ఉద్ధరించటం వైశ్యులకేగాక యావద్భారత వర్షానికి అవశ్య కర్తవ్యమై యున్నది. విష్ణువర్ధన మహారాజు మదోన్మత్తుడై వాసవిని హరించటానికి సిద్ధపడ్డాడు గదా. ఈనాడామె పూర్ణయౌవనవతియై షోడశకళా పరిపూర్ణుడైన పూర్ణ చంద్రునిలాగ ప్రకాశిస్తూ ఉంది. ఈమధ్యలో అతడు చేసిన కన్యాపహరణంవంటి దుష్కృత్యాలు చతురత్వంతో నివారింపబడిన సంగతికూడ మీ అందరికి తెలిసిందే. వాసవిని ఉపాయంతో రాజునుండి తప్పించి భాస్కరాచార్యులు ఇల్లు చేర్చారు. పాములవాని వేషంలో బాలనగరులు వచ్చిన ఎత్తుగడ ఎంతో ప్రశంసాపాత్రం, వాసవికూడ ఈసభలో సుఖాసీనై యుండటం ఇప్పుడు మీరుకూడ చూస్తున్న విషయమే కదా? ఆమెను రాజుకిచ్చి కట్టడమా? లేక ఎదుర్కొని పోరాడి మగణించటమా? లేదా రాజశక్తికి తాళలేని ఈ యల్ప ప్రజానీకం ఆత్మహత్య చేసుకొని చావడమా అన్న మూడు ముఖ్య విషయాలు ఈసభలోనే పరిష్కృతం కావాలి.

చంద్ర;- (లేచి) మిమ్ము ముట్టుతున్న విష్ణువర్ధనుని అత్యాచారాలు అరికట్టడం మన వైశ్య సామంతుల కందరికే గాక తదితర సామంతులకు కూడా అవశ్య కర్తవ్యమే నంటాను.

శివ సామ;- ఏమండోయి గోవిందగుప్తగారు! మహా ఫేష్టగ్గా మాటాడుతున్నారే? ఇదిగో నే చెప్పేదేమిటంటే; మీరు నా మాటకూడ జాగ్రత్తగా వినాలి... అదుగో ఏమండోయ్! మీరు చెప్పిందీ, నే చెప్పేది ఒకటే అంటారా? ఏమండోయ్! నాకూ కాస్త తెలుపండోయ్!

చంద్ర;- ఏమిటీ; అసలు నీవు ఇప్పుడు చెప్పిందేమిటో, చెప్పదలచిందేమిటో నాకు తెలిసి చస్తేనా?

శివ సామ;- అడిగితే నేను చెప్పటమూనూ; అదుగో ఏమండోయ్! మహా బాగా చెప్పారే! వాసవిని మహారాజుగారు పెళ్లాడితే మీ కేమంట? అదుగో ఏమండోయ్! నా కామాత్రం తెలియ దనుకున్నారా? మాకూ మీకుమల్లె మంచి, చెడ్డ, మర్యాద, అన్నీ తెలుసు. ఏమండోయ్! కాస్త ఆలోచించకర్లా? వాసవిని మహారాజు పెళ్లాడితే మన మంతా గర్వ పడాలి. ఆ పెళ్ళి చూట్టానికి యెంత జనం వస్తారన్నమాట! అదుగో ఏమండోయ్! ఆవిడ మహారాణి అయితే మనకు ఈర్ష్య ఎందుకండీ! అదుగో ఏమండోయ్! కాస్త నాకూ తెలును.

చంద్ర;- ఏమిటయ్యా! ఆ చెప్పేదేమిటో చెప్పక, మధ్య మధ్య ఏమండోయ్! అంటూ కేకలేస్తా రెవర్ని? నేను నీ ముందే ఉన్నానుగా? ఆ పిచ్చకేక లెందుకు మధ్య మధ్య.

శివ సామ;- ఏమండోయ్! నాకూ తెలుసు కాస్త. మీరు చెప్పకర్లా. (మిగతావాళ్లు బిగ్గరగా నవ్వుతారు. శివ సామంతుడు తెల్లబోయి చౌకా పైకి తీసుకొని కూర్చుంటాడు.)

(తెరలో జయ్ మహాలక్ష్మి గోవిందా హరి - ఇందిరా రమణ గోవిందా హరి, జయ్ సీతారామణ గోవిందా హరి, జయ్ సమస్త హరిదాసులకీ జయ్, పాండురంగ విఠల్ కీ జై!.

భాస్క;- బాబూ! మీరంతా కూర్చోవాలి (వినరు) బాబూ! మీ రంతా కూర్చోవాలి (వినరు) (భాస్కరాచార్యుడు తనలో నవ్వుకొని చివరికిలా చెప్తాడు) బాబూ మీరంతా కూర్చో వాలి. దయచేసి వైశ్య సంఘానికి ఒక చక్కటి నిర్ణయం ఇవ్వాలి అని కోరుతున్నాను. (అంతా సద్దుకు కూర్చుంటారు)

(నారయ్య శెట్టి లేస్తాడు. ఇతని ముఖాన పెద్ద బర్రి వంగ నామాలు ఉంటాయి. అన్ని అవయవాలకు పెద్ద పెద్ద పంగనామా లుంటాయి.)

నార;-(లేచి) ఏమిటండీ బాబూ! మీ నిర్ణయాలు (కొంచెం రోషంతో)

భాస్క:- వాసవిని మనప్రభువు హరించటానికి ప్రయత్నం చేస్తున్నది మీకందరికీ తెలిసిందేగా. ఆమెను రక్షించుకోవటంకూడా మీ కర్తవ్యమేకాదూ? మీరు వైశ్య శేఖరులేగా?

నార;- అవునండి. వాసవిని కాపాడుకోటానికి మేమంతా ఏడుకొండ లకు ప్రమాణం కట్టాం. మీవంటి పెద్దమనుష్యులంతా మహారాణికాబోయే మావాసవి మనసు వశంచేసుకొని బొమ్మ లాట లాడిస్తుంటే ఈ ఘోరమంతా అలివేలుమంగమ్మ తల్లి మొగుడికి చెప్పుకుని జన్మజన్మాలకూ మీజాతి మాజాతి జోక్యం పెట్టుకోకుండా ఉండేటట్టుగా మా ఊసెత్తుకోకుండా ఉండేటట్టుగా వరం తెచ్చుకుందామనే బయలుదేరాం: తెలిసిం దాండి. కలికాలంలో ఏడుకొండలవాడు ప్రత్యక్షదైవం. ఏ మండీ అలా గుడ్లు మిటకరించి చూస్తారు! విఘ్నవర్ధనమహా రాజుగారికి పట్టపురాణి అయి దాసదాసీలతో తులతూగుతూ ఉంటే మీరుచూసి ఓర్వలేకపోయారు. మీతప్పుడు చర్యలు

అరికట్టడానికి మా వైశ్యజాతి అంతా పోరాటం పెట్టుతుంది తెలిసిందా?

పుండరీ;- (లేచి) భేష్ భేష్! నీభావం నాకు బాగా నచ్చిందిరా చెట్టీ! ఒప్పాం నీ జర్రిపంగనామాలకు, మెచ్చాం నీ తోటకూర పొన్నకాయలాంటి పొట్టలో ఎందుకు దేవుళ్ళంటే అన్ని పంగనామాలు పెట్టేశావన్నమాట. నెత్తిమీద ఒకపంగనామం పొట్టమీద ఒకపంగనామం, భుజాలమీద ఒక పంగనామం. అబ్బ ఇన్నిచోట్ల ఇందరు దేవుళ్లు కూర్చున్నారన్నమాట! అయితే నువ్వంతా దేవుడుమయమన్నమాట. ఇంతమంది దేవుళ్ళకు ఒకబొక్కలోంచి ఇంత పిండం వేస్తుంటే వాళ్ళంతా చాలక కొట్లాడుకుంటావనా? ఇలా తరతరవృత్త వాడుచుతున్నందుకు రాజుతరపు మీ బాపతు వాళ్ళందరికీ ఏమాత్రం ముట్టుతోందేమిటి? నీతి జాతిపదలి పంగనామాలు పెట్టి ఏడు కొండలకు బయలుదేరతావా? పంగనామాలు పెట్టి తులసీ దండలు తగిలించావ్రాగా! పైగా రాజాశ్రయం సంపాదించావు వేదాంతుల్లో వేదాంతివి, భక్తుల్లో భక్తశిఖి, నాయకుల్లో నాయకుడివి' ఇక ఎన్ని తప్పుడు కూతలు కూసినా, ఎన్ని కొంపలు తీసినా మన పెంట్రుక కదిపేవాడున్నాడా? భక్తులవేషం వేశావు. గోత్రాలమంద నీవెంట పడుతుంది. నువ్వు మఠాధిపతివి, పీఠాధిపతివి. ఇక ఏడుకొండలకు వెళ్ళి తల తీయించుకొస్తావు. ఇక దానితో నీ తలకాయ లేనిపనులు ఆశ్చర్యాన కలిగించుతూ ఉంటాయి. (చొక్కా చేతులు పైకి తీస్తూ) వాసవి రూపంలో అవతరించిన భారతమాతను, త్రింశత్కోటి కంఠ కలకల నినాదిని, భూదేవతను, క్షమామూర్తిని, ఆ నీచుని చేత బడకుండా కాపాడటం ఈ పుండరీకాక్షుని కర్తవ్యం. నాకీ ప్రపంచంలో తండ్రిలేడు. తల్లిలేదు. నా సర్వస్వం వాసవియే తెలిసిందా?

నార:- నువ్వు ఎంత కక్కుర్తిపడితే మాకేంటయ్యోయ్! మేము వాసవిని క్షత్రియుడికి అప్పగించి వైశ్య జాత్యభ్యుదయం వాంఛించే మనుష్యులం, వైశ్యులంతా ఏకీభవించి వాసవిని రాజమహేంద్ర పురాధీశునికి పట్టపుమహిషిగాచేస్తే మహావైశ్యుల కీర్తిచంద్రికలు నలుదెసల వ్యాపించుతవి. మమ్మల్ని రాజుకింద తొత్తులని, పొట్టకూటికి చేరినవాళ్ళని, ఎన్నితూలనాడినా మేము ప్రభుత్వ పక్షం వదలిపెట్టం. ప్రభుత్వం ఏదిచేసినా ప్రజలమేలుకోసమే నని మా యాత్మవిశ్వాసం. నా పంగనామాలు కూడా అదే భావం వెల్లడిచేస్తున్నాయి. జీవుడు ప్రజలైతే ప్రభుత్వమే బ్రహ్మ. జీవబ్రహ్మైక్యం చేయుటమే జీవబ్రహ్మైక్య వేదాంతంలో ఉన్న ముఖ్యవిషయం.

విజయ:- (లేచి) శెభాష్! ఈ బానిస హృదయానికితోడు వేదాంతం ఒక విశేషమున్నమాట. దౌర్భాగ్యుడా! కొంపకొంపా తిరిగే కుక్కలాగా డబ్బుసంపాదించినవాళ్ళ పక్కచేరి వాళ్ళెంత ఎంగిలి పచ్చడి పారేస్తే మహాప్రసాదంగా స్వీకరించి బుద్ధి జ్ఞానాలు విడిచి యజమానివద్దను తోకాడించే శునకంలాగా ముష్టికోసం నీచ ద్రవ్యంకోసం, నీ వాసవిని, శివునే పెండ్లాడ తాననే పవిత్రకన్యను పౌరుషంమాలి ఎవడో నీచుని దౌర్జన్యానికి వెరచి అప్పగించుకోటం మనుష్య ధర్మమేనా? మీరంతా ఈసభలోనుండి పొండి. మీ యజమానివద్దకుపోయి తోకాడించండి. జై శంకర్, వీరభద్ర. హనుమాన్.

నార:- పర్వతం శాస్త్రులుగారూ! మీరు లేచి ఈ అవబుద్ధి వెధవని మందలించరాదు? అలా చూస్తూ ఊరుకోకపోతే,

పర్వత:- (లేచి) ఇంకా చెప్పేదేముంది? ఈ వెధవ నా కొడుకే, మాదిగ జట్టులో కలిసిపోయినాడు. వీణ్ణి నేను బహిష్కరించాను, సంఘం బహిష్కరించింది. నాకు పుట్టిన లక్షణం ఒక్కటిలేదు వీడికి.

విజయ:- నేనుకూడా మీతో పుట్టినందుకే పశ్చాత్తాపమని ఏడుస్తున్నాను.

పర్వతం:- మాటలు జాగ్రత్తగా రానీరా పుండాకోర్! నువ్వే ఇలా తయారౌతావనే నా ఆస్తిలో ఒక్క చిల్లిగవ్వైనా నీకు ముట్టకుండా సమస్త ఏర్పాటులు ముందే చేసుకన్నాను.

విజయ:- దరిద్రుల కొంపలు తీసి భోషాణంలో పెట్టి దాచిన వెండి చెంబుల్లో నాకు ఒక్క చెంబుకూడా అక్కర్లేదు. గట్లు గలిపి పోరంబోకులు నొక్కి అమాయకుల్ని మోసం చేసి పేరు పెట్టించుకొన్న మీ యకరాలలో నాకొక్క యకరం కూడా అవసరం లేదు.

చంద్ర:- ఈ నీచ శునకాలకు ఈ పవిత్ర సభలో స్థానం లేదు. వాళ్లను వచ్చినదారి పట్టమని ఆజ్ఞాపించటమైనది.

భాస్కర్:- (నారయ్యతో) అయ్యా! మీరంతా పెద్దవారు, తెలిసినవారు కూడ సభికుల భావానికి మీరు శుద్ధ వ్యతిరేకులు. మీరు మీ గృహాలకు పోవటం మంచిది. చంద్రశేఖరగుప్త ఇచ్చిన ఆజ్ఞను తిన్నగా పాలించండి. మీరు ప్రభుత్వ ప్రాపకం కోసం ప్రాకులాడుతూ బిరుదాంకితులు కావటానికి తీవ్ర కృషి చేసుకుంటున్న స్వార్థపరులు (గంభీరంగా) పాపం! మీరు మీ చంచల చిత్తానికి పశువులైపోయినారు మీరంతా వైశ్య జాతిలో జన్మించి నప్పటికీ జాతి గౌరవం వర్జించి ధనాపేక్షతో వాసవి మానభంగానికి సిద్ధపడిన భీరువులు. మీకు మానావమానాలు గాని, గౌరవ మర్యాదలుగాని శూన్య మవటంవల్ల మీ వంటి వాళ్ల రాక ఈ సభలో బహిష్కరింపబడింది. మీరంతా త్వరితంగా వెళ్లిపోవాలని నేను కోరుతున్నాను.

నారయ్య:- అయితే మీరంతా కలిసి మమ్మల్ని బహిష్కరించారన్న మాట!

వాసవి:- పకపకా నవ్వటం, బుగ్గలు పూరించటం ఒక్కసారిగా జరిగే పనికాదు. అనంతప్రాచ్యం వైశ్య సంఘ చరిత్రలో మీ చర్యలు పరిశీలనీయంగానూ ఉంటాయి. లాభాలు పొందుతూ ఉండాలి; కీర్తి ప్రతిష్ఠలూ పొందుతూ ఉండాలి అనేవి ఒక్కసారిగా జరిగేవి కావు మీరు కోరేది వాసవి మాన రక్షణకాదు; వాసవి వస్త్రాపహరణం కోరుతున్నారు. స్వసంఘభావంతోనాక మానవ జాతి సంక్షేమ భావంతో మీరు నైతిక మార్గాన్ని అన్వేషించుకోలేక పోయారు. భక్తుల వేషం ధరించి లోకాన్ని మోసం చేయటం క్షంతవ్యమైన దోషంకాదు. నేను అసిధారావ్రతం అవలంబించాను. నేను వరించిన నగరేశ్వరుని తప్ప మానవుని పెండ్లాడను. నా వ్యక్తిత్వాన్ని ఎదుర్కోటానికి ఇరుపక్షత్తులే కావు బ్రహ్మాస్త్రంకూడా వ్యర్థంకాక తప్పదు. మూర్ఖుడు నెత్తి పైకి వచ్చినప్పుడే తెలిసికుంటాడు. దూరదృష్టి చూడటానికి అతని శక్తి చాలదు. మూర్ఖులు, పాషండులు. సంఘగౌరవ విధ్వంసకులు ఇప్పటికెందరు పుట్టలేదు? చావలేదు? ఈ అనంతమైన ప్రకృతి ఇప్పటికి ఇటువంటి పుట్టగొడుగులను ఎన్నింటిని కన్నది? ఎన్నిటి నిలయించింది? భావికాలంలో వాసవిని అనుసరించేవాళ్లు నాకు ఆత్మశాంతి ప్రదానం చేసినవాళ్లు అవుతారు. నా యాత్మకూడా అట్టివారి శ్రేయస్సును సర్వదా కోరుతుంది. మీరంతా ఆత్మ నాశనం చేసుకొన్న భీరువులు, పిరికిపందలు, క్రూరులైనవాళ్ళంతా నన్నే అనుసరిస్తున్నారు. సరే ఇంక మీరు పొండి. (కూర్చుంటుంది.)

నార:- నావిష్ణుః పృథివీపతేః అన్న పవిత్ర ఆర్యసిద్ధాంతాన్నే మీరంతా కాలరాస్తున్నారుగా. భగవదాగ్రహంలో మీరంతా భస్మం అయిపోవుదురుగాక అని నేను శపిస్తున్నాను.

పురో:- "భగవదాగ్రహంలో" అనకోయి మిత్రమా. నీ యాగ్ర

హంలో లేదా నీరాజు అగ్నిహంలో అనిచెప్పు. మేమంతా అన్నిటికీ సిద్ధంగా ఉన్నాములే!

(రాజదూత ప్రవేశం భాస్కరాచార్యునికి ఉత్తరం ఇస్తాడు, అతడు గ్రహించి చదివి కుసుమశ్రేష్ఠికి చూపుతాడు)

కుసు;- సరే! ప్రభుసందేశం చేరింది. ఆడినమాట తప్పితే రాజ క్రో ధాగ్నిలో వైశ్యులంతా భస్మంకావాలి అని మన ప్రభువు కోరు తున్నాడు.

నార;- సరే ఇక మేమంతా పోతాము. త్వరలో నిర్ణయించండి.

భాస్క;- (దూతతో) సరే ఈనిర్ణయం రేపు సాయంకాలానికి తెలప బడుతుంది అని మీ ప్రభువుకు మనవిచెయ్యి

(రాజదూత, నారయ్య మొదలైనవారంతా పోతారు.)

కుసు:- వైశ్య సోదరులారా! కర్తవ్యపథం నిర్ణయించ వలసిన బాధ్యత ఇప్పుడు మీపైన వుంది. మీరంతా శౌర్యంతో పోరాడటానికి సర్వసంసిద్ధులై యున్నారని నాకు తెలుసు. ఏమైనా మీకుమరణం అనివార్యమే కాకతప్పదు (వాసవితో) అమ్మా వాసవి! నీ యభిప్రాయంకూడా వినటానికి సభ కుతూ హల పడుతోంది.

వాసవి:- (లేచి) భయభ్రాంతులైన మానవులంతా జాగ్రదవస్థకే "మర ణం" అనే నామకరణంచేశారు. మరణంఅంటే మీరు భావించే చావే అయినట్లయితే అది ఆత్మనాశనం అని చెప్పవలసి ఉం టుంది. నిద్రపోవటం, మేలుకొనటం, జన్మించటం, మరణించటం వంటివే. ఈ రెంటిలో దేనినిగూర్చిగాని భయ ముండకూడదు. మనంజన్మించడమే నిద్రపోవటం. మరణించడమే మేల్కొనడం. మేల్కొనేస్థితికి భయమెందుకు? ఈ రహస్యం తెలిసినవారు కూడా ఎంతో దుఃఖపడతారు. అది వారి యజ్ఞానమేనని

కాస్తాయి. మరణానికి భయపడటం, త్రాడును చూచి పాముని భ్రమించటం అన్నమాట. భ్రాంతివల్ల మానవుడు త్రాడును పాము అని తలంచాడు, విశ్వసించాడు కూడాను. నిజంగా అక్కడ త్రాడే వుండి పాములేదు. నా ఉద్దేశప్రకారం మీరు అంతా రాజుతో యుద్ధముచేసినా, మీరంతా పోవటమే కలుగుతుందికాని వాసవిని మీరు కాపాడలేరు. అది మీకు అసంభవం కూడాను. గనుక నేను ముందగ్ని ప్రవేశము చేస్తాను. తర్వాత రాజుకు నా బూడిద చూపి నా గుర్తు చెప్పండి. యుద్ధంచేయుటం, చావటం యిక్కడ ముఖ్యవిషయం కాదు. వాసవి మానసంరక్షణం యిక్కడ ప్రధానవిషయం. దీనివల్ల వాసవి మానసంరక్షణ అవుతుంది, మీరంతా సుఖంగా వుండగల్గుతారు.

చంద్ర;- అమ్మా! నీవు చెప్పినదంతా నాకుగూడ యుక్తంగానే తోస్తుంది. చావటం ఎలాగూ తప్పనపుడు నీవు, మేము అంతా యుద్ధమే చేసి ఆ యుద్ధములో మరణించుదాం. అగ్నిలోపడి నీవు చస్తే రాజు తన ఆగ్రహాన్ని మాపై ప్రయోగించకుండా వదలుతాడా? అప్పుడైనా ఎలాగూ మేముకూడ చావవలసిందే. అందుకే యుద్ధంచేసి మనమంతా చద్దామంటాను.

వాసవి;- ఇందుకై నేను చేసిన నిర్ణయం వినండి. నేను ఒక్కదానినే అగ్నిప్రవేశంచేస్తే మిగిలినవాళ్ళు కూడా రాజు క్రోధాగ్నిలో దగ్ధంకాక ఎలాగు తప్పదు. అందుకే నూటరెండు గోత్రాల వైశ్యులు బిడ్డలనుమాత్రం విడిచి దంపతులంతా అగ్నిప్రవేశం చేస్తే మిగిలిన బిడ్డలమీద రాజాగ్రహం ఏమిచేస్తుంది. ఆ పసికూనలను చంపి రాజు ఎవరిపై పగసాధించుకుంటాడు. కాబట్టి నూటరెండుగోత్రాల వైశ్యదంపతులు సిద్ధంకావాలని నా యాశయం. యుద్ధమేలాగూ చేయక తప్పనిస్థితిలో అల్ప

సంఖ్యాకులైన వైశ్యులు మరణించి వాసవిని రాజుకప్పగించటం కంటే నా నిర్ణయం ఉపయుక్తమైనదని నా భావం. పలికినాసల పైన రాజుకు కనికరంకూడా పుట్టవచ్చు.

చంద్ర:- ఇలా మగవాళ్ళు, ఆడవాళ్ళు అగ్నిప్రవేశం చేసినట్లైతే ముందు కాలంవాళ్ళంతా ఏమనుకొంటారు? వైశ్యులంతా పిరికిపందలై రాజును ఎదుర్కొనలేక ఆత్మహత్య చేసుకొని చచ్చారు అనే నింద వైశ్య సంఘంమీద మోపరా? అది మన అప్రతిష్ఠకు కారణంకాదా! మనంపోయినా మనకారణంగా, మన అనాలోచన కారణంగా, మనముందు సంతతివారికి ఎంత తలవంపుగా ఉంటుందో ఊహించావా? వాసవీసోదరా?

భాస్క:- అది నీపిచ్చి అభిప్రాయం యువకుడా! చావసిద్ధపడినవారు ఎట్లైనా చావగలరుగదా! ఈ మాత్రానికే వారి నిష్కళంక వీరత్వాన్ని శంకించే పిరికిపందలతో మనకేమిపని? మనం చచ్చినా బ్రతికినా ఆదర్శంగా ఉండాలి. మోసపరేని చావును ఆత్మహత్యకు భేదం ఏమిటి? అగ్నిప్రవేశం చేయగలిగిన మహాధీరుని ఏ మూర్ఖాత్ముడు పిరికిపందయని శంకిస్తారు? అయినా అట్టి నరపశువులకోసం మానవుడు బ్రతుకకూడదు. చావకూడదు. తెలిసిందా.

వాసవి:- సోదరా! నీవు యుద్ధంచేసి హతుడవై నీసోదరి వాసవిని రాజుకు అప్పగించటంకంటె వేరుపాయం నీకుంటుందా? అట్టి స్థితిలో గురూపదేశం సార్థకం చేయుటం నీవిధి కాదునాయనా!

చంద్ర:- (యోచించి) పెద్దల నిర్ణయం నాకంగీకారమే అయితే ఇందుకై 102 గోత్రాల వైశ్యులకు ఆహ్వానాలు పంపండి. జయ్ వాసవీకన్యకా పరమేశ్వరీకి జయ్ (అంతా అంటారు)

వాస:- ప్రియయువకులారా! విజయసాధన కప్రయత్నులై యుండండి. పరమేశ్వరి మీకాత్మశాంతి కలుగజేసి మీ సంతతివారికి ఆయురారోగ్యైశ్వర్యాలను అనుగ్రహించుగాక. భక్తి తత్త్వాన్ని, మానవసేవనూ, పవిత్రతకు ఫలదాయకం చేయడానికి వచ్చిన వాసవి కార్తీక శుద్ధ త్రయోదశి, బుధవారంనాడు ఇహలోకానుభవం చాలించి భౌతికదేహ త్యాగంతోబాటు దివ్యదేహాన్ని ధరించబోతున్నది.

అంతా:- జయ్. వాసవీ కన్యకాపరమేశ్వరికి జయ్.

పదవ రంగం సమాప్తం.



# వాసవీ కన్యక

## పదకొండవ రంగం

(బ్రహ్మానందశ్రేష్ఠి గృహం. భార్యతో ఆలోచనాపరుడు)

బ్రహ్మ; "నానాటికి తీసికట్టు నాగంభొట్లు" అన్నారు పెద్దలు. ఇలా తలా తోకా లేని సంసారాన్ని ఎలా ఈదటం? మనకు పిల్లలు కలిసివచ్చినట్టు డబ్బులు కలిసివస్తే ఎంతబాగుంటుంది. పుట్టే బిడ్డలు పుట్టటం, చచ్చేబిడ్డలు చావటం ఇదేం ధర్మసత్రం అనుకున్నారా? ఇలా పూటపూటకు పిండం వెదకటం ఎంత కాలం? ఒకనాడా రెన్నాళ్ళా పాతికేళ్ళనుంచి ఒకటేబాధ, కొంపనిండా ఒకటేరొద! ఒకవంక కొంపచుట్టూ తిరిగే అప్పులాళ్ళు, ప్రతివీధినుంచి సత్తిన ముసుగేసుకు పారిపోవటమేగా మనబతుకు. అబ్బబ్బ! ఈపిల్లముండాకొడుకులకు అజీర్తిరోగం పుట్టుకొచ్చినా బాగుండును. రోజురోజుకు ఆకళ్ళుపెరిగి కొంపల్ని మింగే స్థితికి తయారౌతున్నారా బాబూ! ఇహ ఇంటిదాని మోత చెప్పనే అక్కర్లేదు. అబ్బబ్బ! ఇంటా మోతే, బయటా మోతే, ఈమోతతో చెవులు గింగుర్లెత్తిపోతున్నాయి. నాగమణీ! ఏమిటి ఆలోచిస్తున్నావు.

నాగ;- కలిసిబాటులేందే మీ కేంచేస్తారని.

బ్రహ్మ;- అదేమిటేవ్! అలా అంటావు. కలిసిబాటు ఊరుమొత్తం మీద మనకు కాకపోతే మరెవడికి? ఈ గావుకు బావుకునే సంసారం అంతా కలిసిబాటు కాదూ? ఈ గొడ్డుపాలు పోసి బిడ్డల్ని పెంచుకోటం కలిసిబాటుకాదూ? నేడోరేపో మళ్ళీ కంటానికి సిద్ధంగావున్నావు. ఇదంతా కలిసిబాటుగాదూ? గాలికిపుట్టే సంతానమంతా గోలెత్తి ఏడుస్తుంటే, అదుగో

నొప్పి ఇనుకోనొప్పి అంటూ నువ్వు బుజాలుపిసుకుతుంటే, అప్పులాళ్ళంతా యములాళ్ళలాగ తగులుకుంటే, కడుపునొప్పి, కాలునొప్పి, కంటినొప్పి, తొంటినొప్పి, నన్ను పీక్కుతింటుంటే నౌకరీలోకి తిన్నగారావటంలేదు పీకిపారేస్తామని అధికారులు గుజ్జుజ్జచేస్తుంటే, నువ్వూ నేనూ, నేనూ పిల్లలూ, పిల్లలూ నువ్వూ కొట్టుకుచస్తుంటే రోగాలువచ్చి కొంపలో మూలుగుతూ ఏడుస్తుంటే, ఎత్తులువేసి శత్రువుల్ని తప్పుకుంటూ కాపు రాకులో నిళ్ళచతు సంసారం ఈడ్చుకొచ్చేమగాడు మొనగాడు కాకపోతే కడంవాడంటావా? అప్పట్టు ఈపూటకు బియ్యం ఉన్నాయా?

నాగ:- అదిచెప్పటానికే ఇలావచ్చాను. అబ్బ! నాకు వచ్చేనొప్పి పోయేనొప్పీను. అబ్బ! రవంత పప్పిడైనా తేకూడదూ?

బ్రహ్మ:- పప్పిడి! (చప్పరించి) చప్పుడుచేయకుండా పడుకో. రాను రాను ప్రపంచం అంటే రోతపుట్టుకొస్తోంది.

నాగ:- (బాధతో) అయ్యో! నాకు నొప్పులొచ్చేట్టుందండి. అబ్బ ఏంచెయ్యాలో? పెద్దవాడింటిదగ్గరలేడు. ఎక్కడున్నా బియ్యం బదులు తెమ్మని పంపాను. వాడింకా రాలేదు. నాకు చూస్తే నొప్పులు పెరుగుతున్నాయి దేవుడా! ఏంచేయవలెచావోగదా! ఈసంసారం. రాముడు, కనకం, కంచంపట్టుకొని వాళ్ళోరు ఏడుస్తున్నారు. ఏమండీ! ఇది వాతం నొప్పులేమో శాస్త్రి వైద్యుణ్ణి పిలుచుకొద్దురూ?

బ్రహ్మ:- చచ్చాం! వైద్యుడెక్కడనుంచొస్తాడు? మనకొకనాడైనా ఆయనకు ఒక కాసీయివ్వటం ఆచారముంటేగా? అయినా ఏంమందులు ఏంలోకం, నీవెఱ్ఱిగాని. "శతశ్లోకేన పండితః" అన్నట్లు ప్రతివాడూ వైద్యుడేగా మనవూళ్లో! పాపం వాళ్ళకు రోగం పెంచటం బాగానే తెలుసు. తెప్పుకోవటమే చేతకాని

నాక;- అసలు ఈయ్యాల్లో దేవుడున్నాడు కాదండి. డబ్బులేనిదే...
(తలతిప్పుతూ చేతులు వెల్లకిలేసి చప్పరిస్తాడు)

పర్వ;- ఔనా! నాకో కుంకముండాకొడుకు యాదవకులానికి ముసలం పుట్టుకొచ్చినట్టు పుట్టుకొచ్చాడు ఎక్కడపడితే అక్కడ నాకు ఎదురుపడంగనామం సిద్ధం. నిజానికి మనం ద్రవ్యార్జన కోసం కొన్ని పనులు చేశాం (బిగ్గరగా) అదంతా ఎవడికోసమంట? లోకుల కొంపలు తీశానంటాడు. కొంపలు తీయడమంటే ఏమిటి? ఎవడి కొంపైనా పీకి పందిరేశామా? వాడి అవసరానికి ధనసహాయం చేసినందుకుగాను కొంతవడ్డీ దానికి జోడించాం. దాన్ని అసలుతోయ్యాలన్నారు. కట్టుకోమన్నాం. తప్పేముంది. కట్టకపోతే కొంపవేలం అన్నాం. అంతేగా. దీనికి కొంపలు తీయటమేమిటి? వీళ్ళగోల తగలెయ్య.

నాక;- అవును. వాడన్నిటికీ ఒప్పుకునేగా, "ఎప్పుడు అడిగితే అప్పుడు యివ్వగలవాడను" అని రాసిచ్చాడు? పైగా అవసరంలో ద్రీతన కొంప మీదేసిన తాకట్టుకూడా పెట్టాడు.

పర్వ;- అదీసంగతి! నువ్వు నూరేళ్లూ బతికేటట్టున్నావ్! అందాకా ఎందుకూ! ఈ బ్రాహ్మణుడుంగారూ కొంపతాకట్టుపెట్టి రెండు వేల రూపాయలు మనదగ్గరనుంచి సంగ్రహించాడు. అయితే చాలవరకు తీర్చిపారేశాడనుకో. ఇంకా యాభై రూపాయలు ఇవ్వాలి. దీనికోసం కాలుకాలిన పిల్లిలాగా వీడి కొంపచుట్టూ తిరగలేకచస్తున్నా. ప్రొద్దునలేవటం వైశ్వదేవం చేయటం తదనంతరం భగవద్గీత పారాయణ, తరవాత ఆత్మనివేదనా, భోజనం. ఇప్పటివరకూ కాలంఅంతా భగవత్ కైంకర్యానికేగదా సరిపోయింది? ఇహా యిప్పటినుంచీ వీడి వడ్డీబాకీకోసం తిరగటమే సరిపోతుంది. ఇదుగో పెళ్లాం కడుపుతో ఉందని, సింధూర

భూషణంకుప్పె కొన్నానని ఇదుగో బిడ్డకొప్పులు వస్తున్నాయని వంకలు పెట్టడం, తప్పించుకోటం. అనంబివాలయ్యా ఒకకే కాకిగోల. ఇంటాక నుగ్గిచెట్టుక్రింద... ...పెద్దకొడుక్కు-సన్నిపాతజ్వరం కుదిర్చితే మెచ్చి మేకపోలు కప్పుతానన్నాట్ట. వాడు కొంపకొస్తే (పకపకనవ్వి) కొంపలోఉండే ఏ భోషాణం చాటునో నక్కి- వెధవదౌర్భాగ్యుడు, కొంపలో లేడనిపిస్తాడు. వాడెట్టాచస్తే మనకెందుకు, ఇవ్వాళ డబ్బు చేతిలో వేసుకునే పీడికొంప కదులుతా. చూస్తావుగా నా తమాషా! (పారజూచి) అదుగో వస్తున్నాడల్లే ఉంది. పద.

(తేలుకుట్టినబాధతో బ్రహ్మానందం ప్రవేశం.)

బ్రహ్మః- అబ్బ! ఈ మృతనష్టపు తేళ్ళన్నీ దరిద్రులకోసమే పుట్టినాయి కాబోలు. కడుపులో ఆకలిమంటతో హోరుమని ఏడుస్తూ, దిగాలుపడి కూర్చుంటే, పెళ్ళాం ప్రసవవేదన వెంటపడింది. మంత్రసాని కొంపకుపోతుంటే... అబ్బబ్బ ఏమిబాధ! ఇది పైకెక్కుతోందిరా దేవుడా! ఊఁ శ్శ్యా అయ్యో! (ఏడుస్తాడు) ఈ దేవుడున్నాడంటా చచ్చేవాళ్ళంతా చూచిచెప్పేమాటేనా అబ్బ! దరిద్రునికి మందెవరిస్తారు! ఆకలిమంటలో అలమటించిపోయి పైప్రాణాలు పైన పోతుంటే ఇందులో వృశ్చికబాధ ఒకటా? అబ్బా! ఏంచేస్తే బాగుంటుంది?

పర్వతం;- (కూర్చుండి) ఒక్కపని చేస్తావూ?

బ్రహ్మః- అదెవరు?

పర్వతం;- నేనేమీ ఆడదాన్నికాదు "అదీ" అంటూ పలకరించటానికీ మొగాణ్ణి కనబట్టాలా? ఇదో దురభ్యాసం ప్రతివాడికీను (నారయ్యతో) ఎవడినైనా పిలుస్తామా వెంటనే "ఎవరదీ" అంటూ ఓ సింహగర్జన చేస్తాడు ఇంట్లోంచి

నారద;- ఆః అంటే అనో దర్జాలెందుకి, తెలియకకాదు. అలా అంటే అది ఆయన హోదాను తెలియజేస్తుందన్నమాట.

పర్వతం;- ఆఁ దర్జా! ఇకనో చూస్తున్నావుగా. అయ్యోదర్జా చూడవే అమ్మో అది జాకీలవాళ్ళ వస్తే తోలునాటకం ఆడుతున్నాడు.
... తోలునాటకం ...

నారద;- తానుండేది వాలిగుంటపట్టు. తలిచేవి మిద్దెలూ మేడలూ అని
పర్వతం:- ఉడతకేలరా ఊళ్ళోవార్తలని.

బ్రహ్మ;- గొడ్డుమోతుకేమి తెలుస్తుందిరా బిడ్డగొప్పులన్నారు. నీవు బిడ్డలను కన్నావా? ఈనారయ్య ఒకడు తయారయ్యాడు నీకు తోడు ఓగొడ్డుబోతు. వాడికేం పిల్లాజెల్లా. దేవాలయమంత కొంపకట్టాడు. ఒక్కమొగుడు పెళ్ళాయూను. అజీర్తిరోగంతో చస్తున్నాడు. మీకు సిగ్గులేదు. మోడుల్లాగా సిద్ధపడ్డారు. ఇంతమంది పిల్లాజెల్లాతో దారిద్ర్యబాధ అనుభవిస్తూ మీవంటి కసాయివాళ్ళదగ్గర అప్పులుతెచ్చి తీర్చుకోలేక, కొంపాగోడూ లేక, ఎండల్లో వానల్లో, తడుస్తూ ఎండుతూ, తిండి, తిప్పలు, కట్ట గుడ్డా లేక అల్లాడిపోతుంటే హృదయం ఉండనక్కర్లా? ఈ కొంపలుతీసిన డబ్బంతా రేపు పాడిమీద వేసుకు కట్టికెళ తారా మీరు? నీ డబ్బెవడికి కావాలంటాను. కొంచెం కష్టం సుఖం చూడనక్కర్లా?

(తెరలో) ఏమండోయి గుప్తగారూ! తలుపు

బ్రహ్మ;- ఆఁ ఎవరది వస్తున్నా. (పోతాడు)

(పెండ్లి పెద్దతో గుప్త ప్రవేశం)

పెండ్లిపె:- శ్రీరాములు గుప్తగారికి మీ పిల్ల నచ్చిందట. విద్యాబుద్ధులు పిల్లవాడితల్లికి మరీనచ్చాయట. కాకపోతే కట్నం విషయంలో మీరంత పట్టుపట్టకూడదు అని చెప్పమన్నారు,

బ్రహ్మ:-(తేలుబాధ మళ్లీ హెచ్చింది) (కుట్టినచోట పట్టుకొని) అబ్బా ఏమిబాధ నల్లతేలు, కట్లం తేలు, జెర్రితేలు, మూడు తేళ్ళు ఒక్కసారే కుట్టినాయి. (విసుగుతో) మీకంతా పోండి నా దగ్గర డబ్బులేదు దస్కం లేదు. మీ సంబంధం నాకక్కర లేదన్నానని మీరు వెళ్ళిచెప్పండి. పోండి.

పర్వత:- గుప్తా! మరి మన బాకీమాటేమి చెప్పావోయి

బ్రహ్మ:- ఇంకా మీ బాకీ తాలూకు యాభై రూపాయలు మాత్రం నిలిచి వుంది. కసాయిగుండెతో ఇప్పటిదాకా వసూలు చేశావు నీ ప్రయోజకత్వంతో నా బాకీ వసూలు చేశాననుకుంటున్నావా? నా నీతి నీకు వసూలు చేసిపెట్టింది. శేషాన్ని ఇప్పటికి సెలవు తీసుకో, నీ బాకీ త్వరలోనే వసూలు చేసి పెడతాలే. నడవండి. ఆచారాలు. అత్యాచారాలు, కాకుల్ని కొట్టటం గద్దలకెయ్యటం. ఇంత తేరగావచ్చిన నెయ్యి నిప్పుల్లో పొయ్యటం అగ్నిహోత్రుడు మెచ్చాడంటూ దవ్వాకొట్టుకోటం, కసాయివాడికి మించిన కాఠిన్యం, హద్దులుమీరిన లోభత్వం దేవుడు దేవుడంటూ మొరగటం, ఏం బ్రాహ్మణీకం?

పర్వతం;- దేవుణ్ణి చాటేసుకొని మేము డబ్బు సంపాదిస్తుంటే మీరు మాత్రం సంఘం, సంస్కారం, దేశసౌభాగ్యం అంటూ ఇప్పటికెంత డబ్బుకాజేశారు? పెత్తనాలుకొట్టుకూ మీరు సంపాదిస్తుంటే దేవుడుపేరు చెప్పుకు మేం బతుకుతున్నాం. అసలు నీ వాలకం అంతా చూస్తే నాకొడుకు ఉపదేశాలన్నీ నీకు పట్టినాయిలాగ ఉందే?

బ్రహ్మ;- పాము నోటిలో విషంపుట్టింది, నెత్తిమీద మణిపుట్టింది. రెంటికీ ధర్మం ఒకటేనంటారా? పోండి. మీకంతా బ్రాహ్మణీకం గలవారు.

పర్వ:- నువ్వు నాకొడుకును మెచ్చుకుంటున్నావు. వాడు కులం చెడ్డా బ్రాహ్మణత్వం వాడికి మీవాళ్ళంతా అంటగట్టుతూనే ఉన్నారట. ఆ దౌర్భాగ్యుడు గోలపెడుతూనే ఉన్నాడు, నేను చూట్టం లేదనుకున్నావా?

బ్రహ్మ:- వైదిక ధర్మాన్ని చక్కగా పాలించే మహానుభావుల్ని కూడా భేదదృష్టితో చూచేవాళ్ళంతా మీలాగానే నశించక మానుతారా? నీబాపతు, నీవు చెప్పేబాపతూ రెండూ రూపు మాసిననాడే భారతవర్షం పునీతం అవుతుంది. కులమత ద్వేషాలతో భారతవర్షాన్ని దగ్ధంచేసే కౌరవిదయ్యాలను రూపు మాపటానికే వాసవీ కన్యక జన్మించింది తెలుసా? ఆతల్లి మానవ హృదయంలో సంస్కారం తేవటానికే బ్రహ్మచర్యం పూనింది. మీ ఛాందసుల్లాగానే మదోన్మత్తుడైన రాజుకూడా దగ్ధం కాకపోతాడా? అబ్బ తేలుబాధ... తేలుబాధ... నేనిక బ్రతుకను.

తెరలో—నాన్నా! అమ్మ పడిపోయింది పరిగెత్తుకురా

బ్రహ్మ:- అబ్బ! ఏమి నాఖర్మ! (పోతాను)

(తెర వాలుతుంది.)

(పదకొండవ రంగము సమాప్తము)



# వాసవీ కన్యక

## పన్నెండవ రంగం

(విష్ణువర్ధన మహారాజు గృహము. రాజు ఆసీనుడై ఉంటాడు. పుండరీకాక్షుడు ఎదురుగా కుర్చీపై ఆసీనుడై ఉంటాడు)

విష్ణు:- ఏమోయ్! ఇంతకూ కుసుమగుప్తుడు మా శాసనాన్ని ధిక్కరించటానికి సిద్ధంగా ఉన్నాడన్నమాటేగా?

పుండ:- ఆయన ఉల్లంఘించాడనుకోండి. పోనీ మీరు మీ రాజధర్మాన్ని గుర్తించితే చాలదూ! ఇదేనా మీ రాజరికం? కన్యలకు పెండ్లిండ్లు చేయించి వారి బాధ్యతలన్నీ వహించవలసి ఉండగా ఎదురు కన్యలను హరించే బుద్ధి మీకే వచ్చిందేమో! ఈ కాలంలో, కంచే చేను మేస్తోంది లెండి.

రాజు:- ఏయ్! ముసలివాడా కొంచెం మాటలు జాగ్రత్తగా రానీ, నీవు ఎవరిముందు మాట్లాడుతున్నావో తెలుసా? ప్రతిజ్ఞాభంగం చేసినపాపి, చండాలుడు, వాణ్ణి నీవు సమర్థిస్తావా? ఇట్టి నీచుల్ని శిక్షించవలసిన బాధ్యత నాది. రాజశాసనం త్రాచుపాము. ఆ చండాలునికి చర్మం ఒలిపిస్తాను. అధమవైశ్యజాతి. వాసవికి నాతో పెండ్లి చేసే విషయంలో జాతికి జాతి ఏకమైంది. జాతిలో ప్రతివాడూ నాకొక త్రాచుపామైనాడు. ఈ వివాహమే జరుగకపోనీ చూస్తాను. వీరి శౌర్యం ఎందాకా ఉందో? నాతో అబద్ధమా? ఈ జాతి నూటరెండు గోత్రాలవాళ్ళు గుడు గుడు గుంచం ఆడి తీర్మానించింది ఇదా? రాజును గాడిద చేస్తారా? వాసవి మీద ఉండే మక్కువకొద్దీ నిన్ను వదిలాను. జాగ్రత్తగా బ్రతుకు పో! ఆ భాస్కరాచార్యుడు బ్రహ్మజ్ఞానసంపన్నుడనుకున్నాను; ఇలా వంచన చేస్తాడా? మసిపూసి

మూలేదుకాయ చేస్తాడా? వాడు నన్ను తప్పించుకొని ఎక్క-డికి పోతాడనా! బ్రహ్మజ్ఞానమట బ్రహ్మజ్ఞానం...

పుండ;- బ్రహ్మజ్ఞానం అంటే... దేశంలో ఉండే కన్యలను ఎత్తుకొచ్చి రాజుకిచ్చుకోటమాండి?... ...అహా నాకు తెలియక అడుగుతున్నానులెండి.

రాజు;- నిన్నిప్పటికొకసారి క్షమించాను. నా రాజధర్మానికికూడా కొంత హద్దున్నది.

పుండ;- అలాగే నా సహనశక్తికూడా కొంత హద్దుందండి రాజుగారు! మీరు వాసవిలాంటి కన్యలను ఎందరినో కన్నారు. కూతురులాగా ప్రేమించవలసిన వాసవిని కామంతో వక్రంగా చూస్తారా? ఏమంటి రాజుగారూ?

రాజు:- (భావంమార్చి) వత్సా! అదేమిటోగాని నీవు ఎన్ని చెప్పినా వాసవిలేంజే నేను బ్రతుకలేను. నా హృదయరాజ్యానికి ఆమె రాణీ అయిపోయింది. మీ వైశ్యులందరికీ ఇంతపట్టు ఎందుకూ? నేనేం వివాహితురాలను బలాత్కరించటమా ఇది? నాలో ఏమైనా తప్పులుంటే క్షమించి వచ్చి నన్నాలింగనంచేసి పుణ్యం కట్టుకోమన్నానని మీ వాసవికి మరీమరీ చెప్పుదూ! మామగారికి నా వందన సహస్రాలని చెప్పు. భాస్కరాచార్యులు నిజానికి బ్రహ్మజ్ఞాన సంపన్నులు.

పుండ;- అసలీ దండకమంతా ఏమిటి? మీకేమైనా మతిపోయిందా రాజుగారూ? వాసవి మానవుణ్ణే పెండ్లాడనని చెప్పుతుంటే నీవేమిటో మామగారు, పెళ్లాంగారు అంటూ పాటలు సాగించావేమిటి?

(విదూషకుడు ప్రవేశం)

విదూ;- మిత్రమా! సొగసులు ఆడవాళ్ళను వశంచేసుకునే (నశ్యంపీల్చి)

ముగాలోపాయం తెలియలేదు. మగవాడిలో పసఉండాలిగాని అది అరుంధతిగాని దాని తలదన్నిందిగానీ...

రాజు;- అదేమిటో తెలవిద్దూ మిత్రమా!

విదూ;- అదెంతలే! ఆడవాళ్ళకు నగలంటే మహాసరదా ఆ ఉపాయం కూడా ప్రయోగించి చూస్తావా? రాజు తలచుకుంటే దెబ్బలకు కొదువా? ఊఁ కానీ...

పుండ;- ఊఁ మీ ఇష్టంవచ్చిన ఉపాయాలు పన్నండి. ఆమెను ఒప్పించండి. ఊరకే అనవసరంగా మాజాతి ఏమిటో తీర్మానించిందని మా అందరిమీద పెట్టేస్తారెందుకు మీరంతా? వాసవి హృదయం మార్చటానికి మీ ఉపాయం కొంత అనుకూలంగానే ఉంది. అయితే కార్తీక శుద్ధ ద్వాదశి బుధవారం ఆమె ఒక గొప్పవ్రతం చేయబోతోంది. ప్రస్తుతం ఆమె చిత్తం చాలా చికాకులో ఉంది. వ్రతసమాప్తి అయితేనేగాని మీ రాణి హృదయం వశపరచుకోలేకపోతారు. అబ్బ! ఆనాడు గొప్పగొప్ప గోదానాలు, భూదానాలు, హిరణ్యదానాలు, హోమాలు, అగ్నిజ్వాలలు, ఆకాశాన్ని అంటే మంటలు మంత్రాలు, అబ్బ ఆవిడ మహా హడావుడిలో ఉంటుందనుకోండి. పగలు నాలుగోజాము దాటేసరికి మీరే అక్కడికి స్వయంగా దయచేస్తే మీ గౌరవమర్యాదలకు లోటుండదు. అంతా చస్తాం. పొరపాటు పొరపాటు... చూస్తాం కళ్ళారా.

రాజు,- యువకుడా! నీనోటివెంట అశుభవాక్యాలు వస్తున్నాయి ఏమి హేతువో!

పుండ:- ఈశ్వరాజ్ఞ అదేమిటో నోరుజారివచ్చింది. సరే.

విదూ;- అవునులే. ఈ ఆడవాళ్ళకు వ్రతంపిచ్చి, నగలపిచ్చి మహా జాస్తి ఆ పిచ్చి తగితేనేగాని (నవ్వు)

రాజు:- సరే! నీఉపాయం మహాసక్రమంగా ఉంది. బుధవారం సాయంత్రం వేళ మారువేషంలో పరదేశీలాగా వస్తా కుమారా! నిన్ని నాటినుంచి నా యాంతరంగికుల్లో కలుపుకున్నా.

విదూ:- నీటిలో మునిగేవాడికి గడ్డిపరకకూడా ఆధారంగా కనబడుతుంది. మనపని అలాగే ఉంది. ఎవడు ఏదిచెప్పితే అదే మనకు వేదం.

పుండ:- ఇక నే పోయివస్తా (పోతాడు)

విదూ:- ఇంత వెఱ్ఱిబాగులవాడితో ఎలా? శత్రుపక్షంవాడు నీకు అంతరంగికుడా! వానికి రహస్యమంతా చెప్పివేయుటమే? సరే కానీ. ఏంజరుగుతుందో చూద్దాం.

రాజు:- పోదామా?

విదూ:- అవశ్యం (ఉభయులు పోతారు)

(తెరపడుతుంది.)

పన్నెండవ రంగం సమాప్తం.



# వాసవీ కన్యక

## పదమూడవ రంగము

[బ్రహ్మానందగుప్త గృహము. వాసవి, భాస్కరాచార్యులు, బ్రహ్మానందగుప్త ఉంటారు.]

భాస్క:- మానవ జీవితం ఎంతచిన్నదో అంత పెద్దదికూడాను, అనంతమైన జీవితం హద్దుకు లోబడింది. నటుడు తన్ను మరచిగదా అభినయిస్తూ ఉంటాడు. అలాంటి తన్మయత్వంలోనేకాదూ నటన కుదురుతుంది. (గుప్తతో) నీభార్యకూడ ఈ మానవ లోకంలో నటించటం పూర్తిచేసింది. సత్యం ఇప్పుడామెకు గోచరించింది. ఆత్మజ్ఞానానికి చాలింతి మరొకటుందా?

బ్రహ్మ:- ఆచార్యా! నేనందుకు విచారించటంలేదు. పుట్టినవాళ్ళంతా ఏదో ఒకనాడు చావలసిందేగా? ఏనాడో ఉండేది ఈనాడే రావటం మరీమంచిది. కాని... నా స్వధర్మం పూర్తిచేయకుండానే ఈఘోరం జరగటం నా సంతాపానికి కారణం అవుతోంది.

వాసవి:- ఏమిటా స్వధర్మం?

బ్రహ్మ:- వాసవీ! (దుఃఖంతో) ఈడువచ్చినకన్య ఇంటపడివుంటే అది తండ్రికి ఎంతబాధ కలుగజేస్తుందో నీకేమి తెలుసునమ్మా!

[తెరలో] నాన్నా! నాన్నా! (దుఃఖోద్వేగముతో)

భాస్క:- ఎవరమ్మా నీవు?

[శీలవతి ప్రవేశం]

కూడాను. (శీలవతిని కౌగలించుకొని) అమ్మా! ఈపాడువాసవి నీ జీవితాన్ని కూడా నట్టేట ముంచుతోంది. నీకు పెండ్లయినా కాలేదు. పెండ్లికి ధనంలేదు. ఇంతకూ నా సౌందర్యమే నిన్ని స్థితికి తెచ్చింది. (బ్రహ్మానందంతో) తండ్రీ! నీవు మాతో అగ్ని ప్రవేశంచేయటం మానివేయరాదా? మీరు సజీవులై ముందు శీలవతి పెండ్లి చేయండి. ఆమెకు నాయాశీర్వాదాలు.

బ్రహ్మ:- నేనుమాత్రం ఒకట్టణ్ణే నిగిలి రాజును జయిస్తానా? ఆనీచుని చేతిలోని మరణంకంటే అగ్నిప్రవేశం అత్యుత్తమమే కాదూ! ఇందుకేగా నూటరెండు గోత్రాల వైశ్యులూ అగ్నిప్రవేశం చెయ్యటం? అమ్మా! నీ యగ్నిప్రవేశం ఎంత ఆవశ్యకమో మా యగ్నిప్రవేశంకూడా అంతే ఆవశ్యకంకాదూ? ఆవులు చస్తూ లేగలకు మేతపెట్టి పోతాయా?

(లోపలనుండి పదిమంది పిల్లలు ఏడుస్తూ వస్తారు)

శీల:- నాన్నా! ఈపిల్లలను ఏంచేసి పోతావు?

బ్రహ్మ:- వాసవి ఆదేశం వస్తుంది. ఆమె అగ్నిప్రవేశం చేసినతర్వాత ఆమె వైశ్యలోకానికి కులదేవతగా వెలుస్తుంది? ఆమెయే ప్రత్యక్ష దైవం. అంతా ఆతల్లి స్వాధీనమే చేసిపోతున్నా.

(క్రమంగా గ్రామస్తులు కొందరు వస్తారు. స్త్రీ పురుషు లుంటారు.)

ఒకరైతు:- అమ్మా! నీవు భూలోకపార్వతివి. అగ్నిప్రవేశం చెయ్య బోతున్నావు అతివృష్టివల్ల, అనావృష్టివల్ల పైరులు పండక అష్టకష్టాలకు లోనౌతున్నాం. మాకు చల్లనివర్షం అనుగ్ర హించు తల్లీ!

వాసవి:- నా యగ్నిప్రవేశాన్ని అతిరహస్యంగా ఉంచండి నాయనా మీకు జయమౌతుంది.

ఒకవిధవ;- (ముందుకువచ్చి వాసవికి నమస్కరించి) అమ్మా! నాకు చిన్నతనంలోనే భర్త మరణించాడు, కామపీడితురాలను. పునర్వివాహం చేసుకునే అనుమతి నాకు ప్రసాదించుతల్లీ!

వాసవి;- అమ్మాయీ! స్త్రీలు పునర్వివాహం చేసుకోవటం వేద విరుద్ధాచారం. ఈ వేదగౌరవాలన్నీ మంటకలిసిపోయే రోజులు త్వరలోనే వస్తాయి. ఆనాడు విధవల పెండ్లిండ్లు విరివిగా సాగుతవి. పురుషులుకూడా ఏకపత్నీత్వాన్ని విసర్జించి బహు వివాహాలు చేసుకుంటారు. బ్రహ్మచర్యం సాహచర్యంగా మారిపోతుంది. విధవా వివాహాలకు నీవు మొదటిదానవు. నీ ఇష్టానుసారం వర్తించుకోవమ్మా (విధవ పోతుంది) అచిర కాలంలో భారతవర్షాన్ని ఒక మహాశక్తి పాలిస్తుంది. ఆప్రభుత్వంలో వర్ణభ్రష్టులు పుట్టుకువస్తారు. స్త్రీపురుష భేదం నశింపుతుంది. ఆకలి మంటలతో ప్రజలు దగ్ధమౌతారు, అట్టి హూణరాజ్యాన్ని వైశ్యలోకంనుంచి ఉద్భవించిన ఒకమహాశక్తి ఎదుర్కొని తాను పరమపదం చెందుతుంది.

తే. గీ॥ విశ్వ విఖ్యాత విజ్ఞాన । వీరచరితు
నుద్భవంబంది మన సంఘ । ముద్ధరించి
జాతి చైతన్య మొనరించు । శాంతిదూత
భావిభారత నవయుగ । భాస్కరుండు.

అటుపై ధర్మరాజ్యస్థాపన అయినట్లు ప్రజానాయకులు ఘోషిస్తారు. ఆకలిమంటలతో ప్రజలూ మలమలమాడి చస్తారు, ధన దాహంతో ప్రజలున్మత్తులైపోతారు. ఇది నా భవిష్యద్వాణి.

భాస్క-;- బ్రాహ్మణులే వేదవిరుద్ధంగా వర్తిస్తారు. దానికి "వైదిక ధర్మయుగం" అని పేరుపెట్టుతారు. ప్రజలు, నాయకులూ కులతత్వాలతో కొట్టుకుచస్తారు. అదొక విచిత్రయుగం.

వాసవి:- అట్టిపరిస్థితుల్లో నేను మళ్లీ వైశ్యకులంలోనే పురుషజన్మలో ప్రకటమవటానికి దేవుడు అనుగ్రహించుగాక. సర్వ ప్రజానీకాన్ని నేను ఉద్ధరించుదుగాక! ఇది నా అంతర్వాణి.

ఒకస్త్రీ;- అమ్మా చిన్నతనంనుండీ మాకళ్లముందే పెరిగావు (కన్నీరు) ఇవాళ నిప్పుల్లోకి దూకుతున్నావు ఎంత సాహసవంతురాలవు కాకపోతే.

వాసవి;- నావంటి వీరకన్యలు ఎందరో పుట్టుకొస్తారు. చింతింపకు తల్లీ!

(కుసుమగుప్త ప్రవేశం,)

కుసుమ;- (ఆగ్రహంతో) యాదవకులానికి ముసలంలాగ పుట్టుకొచ్చావు. వంశనాశనం చేస్తున్నావు వాసవీ ! నీవంటి కూతురు గర్భశత్రువుకైనా వద్దు అని మొక్కుతూ అగ్నిప్రవేశం చేస్తున్నా.

భాస్క ;- కుసుమగుప్తా! ఎందుకలా ఆగ్రహిస్తావు? నీ ఉత్కృష్టత నీవే గుర్తించలేకపోతున్నావు.

కుసుమ;- సరే ! నూటరెండు వైశ్యకుటుంబాల్లోనుంచి, ఆయా దంపతులు రేవు నగరేశ్వరాలయానికి చేరుకునేటట్లుగా ఏర్పాటు చేయించారుగదా ?

వాసవి;- (శీలవతితో) అమ్మా! నీ వివాహానికి ఏమీ చింతింపకు భావనపరంలో నీ భర్త నీకై ఎదురుచూస్తున్నాడు. అతడే స్వయంగావచ్చి నిన్ను పరిగ్రహిస్తాడు. నీకు సకల శుభాలు చేకూరుతవి,

బ్రహ్మ;- జై వాసవీపరమేశ్వరికీ జై, (అంతా అంటారు)

(తెర పడుతుంది.)

(పదమూడవ రంగము సమాప్తము)

—o—

# వాసవీ కన్యక

## పదునాల్గవ రంగము

(నగరేశ్వరాలయంలో కుసుమగుప్త వాసవి, భాస్కరాచార్య, 102 గోత్రాల వైశ్యులుంటారు. ఎదురుగా అగ్నిగుండాలు వెలుగుతూఉంటాయి)

వాసవి:- అన్నలారా! నూటరెండు గోత్రాల వైశ్యులకు నా శుభాశీస్సులు అందజేస్తున్నాను. వైశ్యసంఘ శ్రేయోభిలాషినై నూటరెండు గోత్రాల వైశ్య సంతతి ఆయురారోగ్య ఐశ్వర్యాదుల ననుభవిస్తూ నన్ను భజించి, తరించుదురుగాక యని కోరుచున్నాను. ఇట్టి వైశ్యసంఘంలో, లోకోత్తరుడైన మహా పురుషుడు వామనమూర్తిగా జన్మించి నిఖిల భూమండలానికి ఉజ్వలమైన శుద్ధ అహింస తత్వాన్ని ప్రబోధిస్తాడు. ఇవి నా తుదికోరికలు.

(భటుడు ప్రవేశం)

భటు:- (కుసుమగుప్తునితో) (ఆతురతతో) మహారాజా! విష్ణువర్ధన మహారాజు సేనాసమేతంగా వాసవి అమ్మవారిని పట్టడానికి వచ్చాడు. దారిలో మన బాలనగరులు వారిని తీవ్రంగా ఎదుర్కొన్నారు. అంతకుముందు మన పట్టణమునకు కాపలా ఉన్న రాజ సైన్యముకూడ మన బాలనగరులతో కలిసి రాజు నెదుర్కొన్నారు. మహా ఘోరయుద్ధం జరుగుతోంది. రాజు ప్రళయతాండవం చేస్తున్నాడు. బాలనగరుల సంఖ్య తక్కువైనా వారు మహిషాసుర మర్ధనను జ్ఞప్తికితెస్తున్నారు. పగతుర తలకాయలు చేమకూరల్లాగ తరిగివేస్తున్నారు. రాజు వారిని తప్పించుకుని ఇటే రావడానికి తీవ్ర ప్రయత్నం చేస్తున్నాడు.

కుసు;- సరే నీవు పో, మావని త్వరగా పూర్తిచేస్తాము.

(భటుడు పోవును.)

వాసవి;-ఇంక నేను నా నగరేశ్వర సాన్నిధ్యానికి పోతున్నాను. నా త్యాగ ఫలితమించుమూ ఇక్కడికే వసుకునవచ్చిన విష్ణువర్ధనుని నా దగ్ధదేహంనుండి పుట్టిన భస్మాన్నిచూపి ఇదే నీ విషయ ప్రేమకు ప్రతిఫలమని చూపండి ఈపని గురువులు భాస్కరాచార్యుల వారు నిర్వర్తిస్తారు. (భాస్కరాచార్యునితో) ఆచార్యా! వందనసహస్రాలు. (నమస్కరిస్తుంది)

భాస్క;- అమ్మా! పరమేశ్వరీ! నీ దయావిశేషంవల్ల నాకుకూడా నిజస్వరూపం గోచరమైంది. నేనుకూడ భవిష్యత్కార్యక్రమం యోచించుకుంటాను, మంచిది ఇక నీవు పదతల్లీ!

వాసవి;- చిత్తము. (హరహరమహాదేవ, 3 సార్లు అంటుంది)

అందరు;- వాసవీకన్యకకీ జై... (జయధ్వానములు) (వాసవి గుండమున ఉరుకుతుంది. తరువాత ఒక్కొక్కరుగా జయధ్వానాలతో గుండమున ఉరుకుతారు. భాస్కరాచార్యుడు, కొందరు గ్రామస్థులు మిగిలివుంటారు.)

(నారయ్య మరికొందరు రాజభక్తులు ప్రవేశిస్తారు)

నార;- (ఒకనితో) ఎందుకురా ఈపాడుబతుకు? ఇతికేం చచ్చేం ... దేశంలో ఎక్కడచూచినా మూహాళ ఉమ్మేస్తున్నారు. ఇంకా ఈ రాజును ఈ చితిలో [illegible] తెలియనేలేదు, నాకు వాసవి వాసవి అంటూ అహర్నిశలూ అపోహ పిచ్చిలో పడిపోయి నాను, అందుకే చూడు ఆ మంటలు 102 గోత్రాలవాళ్లు అందులో పడిచచ్చారు, మనంకూడా చస్తే మనమీదనుకూడ పెద్ద నాటకాలు పుట్టిస్తారు. మనలాగా అధీనములైన కొందరు మనుష్యులు బ్రతుకుతారు. "పరోపకారార్థ మిదం శరీరం"

అన్నారు. నేను పడిన తర్వాత మీరుకూడా గట్టిగ పడతారా? మరి!

ఒకడు:- పదకొండుకు వైధవ్యబ్రతుకు. పదముండు. నువ్వనదు.

నాగ:- ఒకసంగతి మరచిపోయాన్రా! నా శాలూకు ధనంఅంతా పరమేశ్వరికి దేవాలయానికివ్రాసి యిద్దామనుకున్నాను. అపని జరుగనే లేదు? సరే. పోనీలే. ఇదుగో పోతున్నాను. (మంటలో పడబోయి వెనక్కు వస్తాడు.) "ఓరి చాలవేడిగా ఉంది. అంత వేడిగాఉంటే ఉరికేదెలా? (చప్పరిస్తాడు, చేతులు త్రిప్పుతాడు) పాపం వీళ్ళంతా ఎలావడిచచ్చారో! ఆ బాధ ఎలాసహించారో!

శివ వాడు:- (చొక్కా చేతులు పైకితీసి ఉరకబోతాడు. వెర్రి కేకతో వెనక్కు పారిపోతాడు. తర్వాత ఒక్కొక్కరూ, చివరకు నారయ్య కూడా పారిపోతాడు.)

( రాజు విదూషకునితో ప్రవేశం)

రాజు:- (భాస్కరాచార్యునితో) ఏమయ్యా! ఆలయమంతా నిశ్శబ్దంగా ఉందేం? ఏవి? ప్రతిష్ఠోత్సవా లెక్కడ? ఈ యగ్నిగుండా లేమిటి? (నలువైపులా చూచి) ఈ యగ్నిజ్వాల లేమిటి? ఈ భయంకర స్మశానంలో పిశాచంలాగా నిలబడ్డావు? నీవు ఎవరు? భాస్కరాచారివా? బ్రాహ్మణాధమా? నా వాసవిని ఎక్కడ దాచావు?

భాస్క:- (వాసవి పడిన గుండం చూపి) అక్కడ!

రాజు:- ఏమిటి? నా వాసవి భస్మమయిందా! ఆమెను హత్య చేశావా పాపి! ఫలితానికి సిద్ధంగా ఉండు. (మెడ పట్టుకొని) బ్రాహ్మణ పిశాచమా!

భాస్క:- నేను వాసవిని హత్య చేయలేదు. నీ క్రోధాగ్నికి ఆమెయే భస్మం అయిపోయింది.

రాజు:- మరి నా క్రోధాగ్ని నుండి నీవు మాత్రం ఎలా తప్పించుకుంటావురా పాపీ! (కొడవలులెత్తాడు)

భాస్క:- నీ క్రోధాగ్ని నన్నేమి చేస్తుంది రాజా! భాస్కరుణ్ణి సంహరించే మనిషి పుట్టాడా? పుట్టుతాడా?

రాజు:- ఏమి నీ అహంకారము! వాసవీ (గుండం దగ్గర చేరి) వాసవీ! నీవీ గుండంలో ఉన్నావా? నీవు లేని రాజెందుకు? త్రికరణ శుద్ధిగా నిన్ను ప్రేమించాను. నీవు కాదన్నా, కాలదన్నినా, నాకు దిక్కేది? నన్ను తప్పించుకొని పారిపోతావా? నా ప్రేమకు ఇదా ప్రతి ఫలం? నేనుకూడా నీ దారినే వస్తున్నాను పద

విదూ:-(గుండమున పడబోతాడు) రాజా! ఏమిటీ వెర్రితనం? (ఆపి) వాసవి నీ కింకా కనబడుతుందా? నీ వెర్రిగాని. శాశ్వతంగా వాసవి నిన్ను వదలేసింది.

రాజు:- మిత్రమా! నన్నాపకు. నేనింక జీవించను. (దుఃఖంతో - గుండె పట్టుకొని) నా వాసవి తప్పిపోయింది. (ఏడ్పు) కామాంధత్వానికి ప్రాయశ్చిత్తం కలిగింది. బాబూ! రండి ఈ కిరాతుని ఒక తంద తేళ్ళతో కుట్టించండి, రాళ్ళతో చావమోదండి (మోదినట్లభినయించి) ఆఁ వచ్చావా! (క్షీణస్వరంతో) నన్ను కూడా రమ్మంటున్నావా? వాసవీ! కైలాస పర్వతంమీద సుఖిద్దామా? భోగించుదా మంటున్నావా? (గట్టిగా) అయ్యో ......... (రక్తపు వాంతి; వెంటనే మరణం),

విదూ:- (భాస్కరాచార్యునితో) అయ్యా! రాజు మరణించాడు. ఇక మన కర్తవ్యం (నక్కెం.)

భాస్క:- దీనితో మనకేమి సంబంధం? నీ పని, నా పనీ, రెండూ పూర్తి అయినాయి. ఇక ఎవరి యిండ్లకు వారు పోవటమే. ఇక్కడ ఈ శవాన్ని చూసే దేముంటుంది? వాసవీ, 102

గోత్రాల వైశ్యులు ఇప్పటికే కైలాసం చేరుకొని సుఖిస్తున్నారు.

(బాల నగరులు, రాజభటులు ప్రవేశిస్తారు.)

భటులు:- ఆచార్యా! (విచారంతో) మా ప్రాణాలు బలిపెట్టికూడ మేము వాసవి అమ్మవారి ప్రాణాలు కాపాడలేక పోయాముగదా!

భాస్క:- నాయనా! విధిని తప్పించటం ఎవరి తరం? వాసవి నాటకం ఇలా పూర్తికావలసియుంటే ఎవరేమి చేస్తారు? నిజంగా వాసవి ప్రాణ రక్షణ కోసం మీరు చేసిన త్యాగాలు అపూర్వం. రాజకీయంగా ఈ తరుణంలో మీరు చేసిన త్యాగాలు భావి చరిత్రకారులు వేనోళ్ళ ప్రశంసించక మానరు. మీ మీ భార్యలను, ఆస్తులను, బిడ్డలను, సర్వాన్ని కేవలం వాసవి కోసం త్యాగం చేశారు. రాజకీయమైన యుద్ధంలో అపూర్వ త్యాగం చేసినదానికి ఫలితంగా మీ మీ పేరులు భావి చరిత్రల్లో "రాజకీయ బాధితులు" అని మహోజ్జ్వలంగా లిఖింప బడతాయి. ఈ మారణ యుద్ధంలో మణిగి పోయింది పాపం మీరేగా? మీ త్యాగాలకు ప్రతిఫలంగా మీమీ పిల్ల పిల్ల తరాన నిలిచి యుండేటట్లు ఈన మాన్యాలు సంఘం తరఫున ఇప్పించటం మా ధర్మమేగాని ఆ భూములైనా గొడ్డు బోయినాయి. ఉన్న భూములైనా చవిటి పర్రలు. వంచేస్తాము పాపం! మీ పోషణకు కావలసిన సర్వ బాధ్యతలు ఇప్పుడు; ఇకముందు ఈ వైశ్య సంఘమే వహిస్తుంది. మీకు రాజకీయ బాధితులని నామకరణం చేయటమైంది.

భ:- అయ్యా! మేము చేసిన త్యాగాలకు మేము బహుమతులు కోరామా?

భాస్క;- మీరు కోరకపోతే మే మూరకుంటామా ! అంత కృతఘ్నులమా?

భటు;- అయితే "రాజకీయబాధితుడు" అనే దరిద్రపు పేరుతీసి ఏదైనా మంచిపేరు పెట్టండి. ఎక్కడికిపోయినా 'రాజకీయబాధితు'డల్లే మొహం నువ్వూనూ అంటూ చేసే హేళనకు అంతుంటుందా? భూదానా లెవరికి కావాలి. మంచిపేరులైనా పెట్టండి.

బాల;- అసలు యీ పేరు నాకు నచ్చలేదండి.

భాస్క:- మరి ఏపేరు నచ్చుతుంది?

బాల;- 'రాజకీయయోధులు' అనేపేరు నాకు నచ్చింది.

భటు;- సరే. ఎక్కడికి పోయినా యోధుడు వస్తున్నాడులే, అని ఏడిపించుక తినడానికా?

భాస్క;- అదంతా వదిలెయ్యండి. "వీరముష్టులు" అనే పేరుతో మీ రంతా భావికాలంలో పరిగణింప బడుదురుగాక. వైశ్యసంఘం కోసం మీరు చేసిన యీ అపూర్వ త్యాగాన్ని పురస్కరించుకొని భావికాలపు వైశ్యులు మీకు అన్నివిధాల తోడ్పడుదురు గాక. (బాలనగరులతో) నాయనలారా! మీ బాలనగరులు స్వసంఘ క్షేమంకోసం, తద్వారా విశ్వశాంతి కోసం చేసిన అపూర్వ త్యాగం మరువరానిది. భావియుగాల్లో వైశ్యులు మిమ్ము స్మరించకుండా ఏకార్యం తలపెట్టరు, ఆచరించరు. ఆచంద్రార్కం మీ ఉభయుల త్యాగాలు నిఖిల ప్రపంచంచేత కొనియాడబడు గాక! "స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః" అన్న ఆర్యోక్తి సార్థకపరచిన మీఉభయులకూ నా హృదయపూర్వక ధన్యవాదాలు! ఇంక నా పనీ నాటకం

యీ క్షణంతో పూర్తి అయింది. మీరంతా మీమీ ఇండ్లకు వెళ్ళి సుఖించండి. వాసవి అనుభవించిన కష్టపరంపరలకు దిగులు చెందక స్వధర్మ నిర్వహణానికి నడుము కట్టండి. విద్యావినయ సంపన్నులై, సకలైశ్వర్య సంశోభితులై వాసవీ కన్యకా కరుణా కటాక్షంవల్ల క్షాత్రం కలిగి బ్రతకండి.

ఓమ్ శ్శాంతి శ్శాంతి శ్శాంతిః

మంగళం మహత్.

(తెర వాలుతుంది.)

[స మా ప్త ము]



ముద్రణ: శ్రీ భారత్ ప్రెస్, గుడివాడ.

# పండితాభిప్రాయములు

ఆస్తికత్వమునకు మూలము ఆదిశక్తి. ఆయాకాలముల కవసరమగు రూపులతో జగన్మాతయగు ఆదిశక్తి యవతరించు చుండుననునది పురాణ ప్రసిద్ధి. అట్టి యవతారములలో నొకటి శ్రీ వాసవీకన్యకావతారము. ఈ యితిహాసమును రూపకానుకూలముగ కృష్ణా మండలమందలి గుడివాడ వాస్తవ్యులైన "సాహిత్యరత్న" దివ్వెల పిచ్చయ్యగుప్తగారు రచించిరి.

ఇయ్యది ప్రస్తుతకాల ప్రదర్శనానుకూల పద్ధతిని కూర్చబడినది. రచన అభ్యుదయకారిగ నుండెను.

ఈ మానవ శరీరాన్ని ధరించినజీవి. మానవత్వాన్ని నిలబెట్టుకొనుటెటుల ? పరోపకారానికా ? పరాపకారానికా బ్రతకడం? అనేది వాసవి చిన్ననాటితలపు. ఇదే విద్యాభ్యాసమునాటి విమర్శ.

నీతికీ, ధర్మానికీ, శాంతికి డబ్బునా, ఎంత యెట్టి సంబంధమున్నదీ, పరోపకారచింత, బాధితులకు సేవచేయడం, ఆడంబరానికా, పదవులకా, లేక మానవధర్మమా ? యనేది వాసవిద్వారా చక్కగ నిరూపింపబడెను.

వరించడ మొకరిని, పాణియనూడడ మింకొకరిని కూడదని ప్రతిజ్ఞ పట్టడం, ప్రతిజ్ఞ భంగపరచడానికై దుర్మార్గాంధులైన ప్రభువులు పట్టు పట్టడం, బాధించడం, నమ్మకొనకు దుష్టకార్యములోనన్న హింసాకారులైన బానిస నౌకర్లోనన్న కఠిన కార్యములు. ప్రతిజ్ఞా పాలనకై పలుపాట్లు పడడంలో ప్రాణాల నర్పించడానికైనా సిద్ధపడడం, సత్యాహింసలే కార్యసాధనమను సిద్ధాంత సిద్ధి కగ్ని కాహుతి కావడమే యుత్తమమని యటులోనన్నట, మొదలగు విషయములతో సులభ శైలిని రచియింపబడెను. అయితే ధీరుడగు కుసుమ గుప్తుడు అగ్ని కాహుతియగు కాలమున కూతురు వాసవిని "యూదవ కులానికి ముసలంలాగ పుట్టుకొచ్చావ్ర" అనడం అనౌచిత్యముగనుండెను.

ప్రమోదము లేదు. ప్రయోజనము లేదు. చివరకు ప్రమాదమే యుభయులకు సంభవించెను. కాముకత్వమున దుష్టత్వము, అతిసౌంద ర్యమున కమితకష్టము, స్త్రీబుద్ధివల్ల త్యాగము, కలుగుననునది గ్రంథ సారాంశము. కథను ప్రస్తుత సాంఘిక పరిస్థితులకు సమన్వయపరచి గ్రంథకర్త సాఫీగా రచనను సాగించెను.

'కవికేసరి' అద్దేపల్లి సత్యానారాయణ,
మండవల్లి (కృష్ణా)

## శ్రీ పిచ్చయ్యగుప్తగారికి —

మీరు వ్రాసిన కార్డునకు జవాబు వ్రాసిన తరువాత మీ "వాసవీకన్యక" గ్రంథమును సగమువరకు చదివించుకున్నాను.

కథ నూతన పద్ధతితో నడిచినది. శైలిమనోహరముగనున్నది. కొన్ని కొన్ని చోట్ల సంక్షిప్త పరుపబడినచో బాగుండెడిదనిపించినది.

ఇదివరలో యీకథ అనేకులు గద్యపద్య నాటికారూపముల రచించిరి. కాని వారందరూ స్కాంధ పురాణాంతర్గత కథా సంవిధా నమునకు నూతన పదజాలములతో ప్రదర్శించిరిగాని స్వతంత్రపోకడ లను చారిత్ర్యాత్మక సాంఘిక సాంస్కృతిక దృష్టిని చూపించి యుండలేదు. ఆ లోపములను మీ గ్రంథము సవరించినదని చెప్ప వచ్చును.

పాఠకుల హృదయముల హత్తుకొనగలుగు మనోహరవర్ణనలు, కథా సంవిధానము శ్లాఘనీయములు.

వైశ్యులు, వైశ్యాభిమానులు, చారిత్ర్యక పరిశోధకులు యీ గ్రంథమును సమాదరింతురన్నదియే నా ఆశ.

— జమిలి నమ్మాళ్వారు.
సంపాదకుడు:- గుంటూరు పత్రిక — వాసవి

జ్యోతి ప్రెస్, :: గుడివాడ.